# నందీశ్వర భరతము

పరిష్కర్త :
మున్నూరు సూర్యనారాయణశాస్త్రి

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ

# తొలిపలుకు

సంగీత, నృత్య నాటకోత్సవాలను నిర్వహించటం, ఆ యా కళలలో శిక్షణాలయాలకు, సాంస్కృతికసంస్థలకు, నిస్సహాయ స్థితిలో గల వృద్ధ కళాకారులకు ఆర్థిక సహాయము చేయటం, మరుగునపడి పోతున్న మన సంప్రదాయ, జానపద కళారూపాల పునర్వికాసానికి కృషిచేయటం మున్నగు కార్యక్రమాలతోపాటు ఆయా రంగాలలో పరిశోధన చేయించి, గ్రంథాలు ప్రచురించే కార్యక్రమాన్ని కూడా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ చేపట్టింది. ఈ పథకం క్రింద సంస్కృతంలోని ప్రామాణిక సంగీత, నృత్యశాస్త్ర గ్రంథాలను అనువదింపజేసి ప్రచురిస్తున్నాము. ఇంతవరకు 'సంగీతరత్నాకరం' మొదటి భాగం, 'నృత్తరత్నావళి' ప్రచురించాము. కర్నాటక సంగీతానికి సర్వస్వంగా పేరుపొందిన 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని' పునర్ముద్రణ కార్యక్రమాన్ని అకాడమీ చేపట్టింది. త్వరలో ఈ బృహత్తర గ్రంథం మొదటి భాగం వెలువడుతున్నది.

పూర్వగ్రంథాల అనువాదాలు, పునర్ముద్రణలు చేపట్టటమేకాక తెలుగునాట సంగీత, నృత్య, నాటక కళా వికాసాలను తెలియపరిచే స్వతంత్రగ్రంథాలను ప్రచురించాలని కూడా అకాడమీ సంకల్పించింది. మొదట నాటక కళాభివృద్ధికి దోహదకారులైన తెలుగు నాటకకర్తలను గురించి గ్రంథాలను ప్రచురించాలని అకాడమీ

నిర్ణయించింది. ఆ ప్రకారంనాటక కర్తలుగా చిలకమర్తి, తిరుపతి-వేంకటకవులు గురించిన గ్రంథాలను ప్రథమంగా ప్రచురించడం జరిగింది. ధర్మవరం, కోలాచలం, గురజాడ ప్రభృతి నాటక కర్తలను గురించి క్రమంగా గ్రంథాలను ప్రచురించ సంకల్పించాము.

అదే విధంగా సంగీత, నృత్య కళాకోవిదుల గురించి, కూడా గ్రంథాలు ప్రచురించ తలపెట్టాము. పంచముఖి మున్నగు అపూర్వ తాళ ప్రదర్శనలు చేయగల ముట్నూరు సూర్యనారాయణశాస్త్రిగారి కళావిశిష్టతను బహుళంగా ప్రచారం చేయడమేగాక, ఈ కళారూపానికి సంబంధించిన 'నందీశ్వరభరతము' అనే గ్రంథాన్ని అకాడమీ ప్రచురిస్తున్నది. దీనిని పరిష్కరించి అకాడమీకి అందజేసిన పట్నాల భరతాచార్య ముట్నూరు సూర్యనారాయణశాస్త్రిగారికి, ఈ గ్రంథానికి పరిచయము వ్రాసి ఇచ్చిన భరతకళాప్రపూర్ణ నటరాజ రామకృష్ణగారికి, ముద్రణలో సహాయపడిన ఎన్. సి. ఎస్. వేంకటాచారిగారికి మా ధన్యవాదములు.

కె. ఆర్. పరమహంస
స్పెషల్ ఆఫీసర్
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ



ముట్నూరు సూర్యనారాయణశాస్త్రిగారు 1901 సంవత్సరంలో శ్రీకాకుళంలో జన్మించారు. వేదాలు, భరత నాట్యం తమ జనకులైన సంగమేశ్వరశాస్త్రిగారి వద్ద అభ్యసించారు. అతి కష్టసాధ్యమైన పంచముఖి మున్నగు తాళ ప్రదర్శనలను స్వయంకృషితో నేర్చుకొని ప్రప్రథమంగా తమ తండ్రిగారి ఎదుట ప్రదర్శించారు.

శాస్త్రిగారు 1924 లో విశాఖపట్నంలో తాళావధానమును ప్రారంభించి, రాష్ట్రంలో పెక్కుచోట్ల ప్రదర్శించి ప్రశంసలనేకాక లయసమ్రాట్, లయవిజయ, పంచముఖిప్రవీణ, షట్కాలభరతాచార్య బిరుదులను కూడా పొందారు. 1960 లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వీరికి విశిష్టసభ్యత్వము నిచ్చి గౌరవించింది. శాస్త్రిగారు మద్రాసు మున్నగు ప్రదేశాలలో సంగీత విద్వాంసుల సమక్షములో ప్రదర్శనలిచ్చి మెప్పుపొందారు.

# పరిచయము

నందిభరతము ఆధారముగా బొబ్బిలి ఆస్థాన విద్వాంసులు భుగత రామయ్య, గోపన్నగార్లు నృత్యకేళికలు చేయించేవారు. గోపన్న గారి పూర్వులు మాడుగుల సంస్థానికి చెందిన నాట్యాచార్యులు. బొబ్బిలి రాజుల ఆహ్వానం మీద ఆస్థాన నాట్యాచార్యులుగా బొబ్బిలికి వచ్చారు. గోపన్నగారి కుమార్తె నీలాద్రివేణి వేణుగోపాలుని ఆలయంలో నృత్యకేళికలు చేసేవారు. ఆలయ నృత్య పూజలో నంది భరతములోని వివిధ కౌతములు, జతులు, వేణుగోపాలాంకితముగా రచించబడిన సప్తతాళ శబ్దములు ప్రదర్శించేవారు. ఈ సంప్రదాయ నృత్యంలో బొబ్బిలి ఆస్థాన నర్తకీమణులు, సోదరులు అయిన గడ్డి భుక్త సంజీవి, చిరంజీవి, సువర్ణ, చిరంజీవి కుమార్తె జీవరత్నమ్మ ప్రసిద్ధులు.

భుగతవారు ప్రసిద్ధనాట్యాచార్యులు, సంగీత విద్వాంసులు మాత్రమే కాక, మృదంగ వాద్యంలో కూడా ఆరితేరినవారు. వారు మృదంగవాద్యంలో అనేక శిష్యులను తయారుచేశారు. వారి వాద్యము ప్రాచీన ద్రుపద పద్ధతికి చెందినట్టిది. తాండవ నర్తన విన్యాసములకు పుష్టి చేచ్చే వాద్య పద్ధతి వారిది. ఆ బాణీని అభ్యసించిన వారిలో ముఖ్యులు ముట్నూరు సంగమేశ్వరశాస్త్రిగారు. వారి కుమారులు సూర్యనారాయణశాస్త్రిగారు 'పంచముఖి' తాళమును నర్తన రూపంలో ప్రదర్శిస్తారు. సుప్రసిద్ధ నటుడు పీసపాటి నరసింహామూర్తి గారి ద్వారా వారి మేనమామగారైన ముట్నూరు సూర్యనారా

యణశాస్త్రిగారిని గూర్చి పూర్తి వివరములు తెలుసుకొని, విజయనగరంలో వారి పంచముఖి జాళ ప్రదర్శనం చూసే అవకాశం కలిగింది. ఈ విద్యనెరిగిన వారు భారతదేశంలో శాస్త్రిగారొక్కరే. ఈకళారీతిని ప్రచారం చేయడమేకాక దీనికి సంబంధించిన 'నంధిభరతము' అనే ఈ గ్రంథాన్ని ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురించడం ఆనందదాయకమైన విషయము.

నృత్తమును ఆకర్షణీయంగా రూపొందించడానికి గాను అనేక విధములైన గతి, జతి, జాతి, యతి, బంధ, చంధోరచనాభేదములతో దానిని అలంకరించుట ఆచారము. ఈ పద్ధతిననుసరించి నాట్యశాస్త్రము లందు తెల్పబడిన ఆయా జతులను విపరంగా తీర్మానములతోసహా కూర్చి, ప్రచారములోనికి తెచ్చిన గ్రంథమిది కనుక ప్రాచీన నర్తన రీతులను ఆరాధించే నృత్యకళాకారులకు యెంతో ఉపయోగపడగలదు.

నాదము, శబ్దము, మృదంగజతి శబ్దస్వరూపము ననుసరించి, నృత్త కల్పన జేసేవిధము, సమవిషమగతి ప్రస్తారమేగాక మరాళ, మయూర. శుక, మత్తేభ, మనుష్య. పశుపక్ష్యాదుల నడకలతీరు, ఆజతులుకూర్చుటకు అనుసరించబడిన చంధోరీతులు, మృదంగ, డమరుక, యిత్యాది యతి విన్యాసాదులు, నాగ, ఖడ్గ, పద్మ, ఛత్ర మొదలైన బంధ రచనలు సమన్వయపరచి జతుల కల్పించి నృత్యములో ప్రయోగం చేయించి, పండితులు, నాట్యశాస్త్రవేత్తలు పరీక్షించిన ఆ శబ్దజాలము నంతను ఈ గ్రంథరూపములో భావితరము వారికొరకు పొందుపరిచినారు బొబ్బిలి ఆస్థాన నాట్యాచార్యులు.

ఇట్టి అపూర్వరచనను సేకరించి అకాడమీకి అందించి దీనికి ప్రచురణ భాగ్యం కలిగిస్తున్న సూర్యనారాయణశాస్త్రిగారికి ప్రచురిస్తున్న అకాడమీకి కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

నటరాజ రామకృష్ణ

# పీఠిక

శ్రీకాకుళమండలమున బొబ్బిలిసంస్థాన మొకటి కలదను విషయము సర్వజన విదితము. ఆ సంస్థానాధీశులగు మహారాజులు ప్రతి శాస్త్రమునున సంపూర్ణ పాండిత్యముగల మహాపండితుల నాదరించి పోషించుట యొక సనాతనాచారము. అట్టి సంస్థానమున మార్దంగిక శిఖామణులు బుగత రామయ్యగారును, ఆతని కుమారులు బుగత గోపన్నగారును భరతనాట్యశాస్త్రముల బండితులై వెల్గొందుచుండిరి. వారి పాండిత్యమపారము.

బొబ్బిలి తాలూకాకు చెందిన వంతరాం గ్రామమున మా తండ్రి గారగు ముట్నూరు సంగమేశ్వరశాస్త్రిగారికి మృదంగ వాద్యాభిలాష మెక్కువగా నుండుటచే మా గ్రామముననే కొంతవరకు నేర్చికొని యుండిరి. అంతట నాయనకు వివాహమగుటయు, సంక్రాంతి పండుగునకు వారి మామగారు పిలచుటయు సంభవించెను. పిదప అల్లుడు మృదంగము వాయించునను సంతసముతో మామగారొక గాయకుని రప్పించి పాడించిరి. కాని యాపాట కనుగుణముగా వాద్యము రాక మాతండ్రిగారు ఓటమిని పొందగా వారి మామగారు చిన్నబోయి "ఇక మృదంగముపై చేయివేయ" నని యల్లుని ప్రమాణము చేయుమనగా నిష్టపడక పౌరుషముతో మరునాడే యింటికిజేరి వేదము చెప్పుకొనెద నను మిషతో బొబ్బిలిచేరి బుగత గోపన్నగారివద్ద

మృదంగము నేర్చికొనుట ప్రారంభించి విద్యలో గురువుల యభిమానము సంపాదించి మూడు సంవత్సరములలో మహామార్దంగికులై తృప్తిచెందక గురువులకడ తాళప్రస్తారమును, ముక్తాయి జ్ఞానమును సంపూర్తిగా నేర్చికొని వారివద్ద గల తాళపత్ర లిఖితములగు నందీశ్వర భరతాది గ్రంధములను సంపాదించి మరల మామగారింటికేగి పూర్వపు గాయకుని తాళము వేయలేనట్లుచేసి మామగారి కానందము కలుగ జేసెను. ఇయ్యది వారి యచంచల దీక్షకు నిదర్శనము.

పిదప కీర్తిశేషులగు ఆదిభట్ల నారాయణదాసుగారి కథాకాలక్షేపమునకు మృదంగము వాయించుచుండ నొకనాడుభయులకు వాదోపవాదమురాగా ముక్తాయి జ్ఞానమున, భరతశాస్త్రమున దాసు గారికి విస్మయము గలుగజేసి శాస్త్రిగారు యఖండకీర్తి నార్జించిరి.

సంగమేశ్వరశాస్త్రిగారికి గల ఆరుగురు పుత్రులలో నేను రెండవకుమారుడను. నాకీ భరతమున నధికముగా నభిలాషయుండుటచే పూజ్యపాదులగు మా తండ్రిగారివద్దనే మృదంగమునేర్చుకొని భరతశాస్త్రమును సంపూర్ణముగా నభ్యసించితిని. నాది వైదికవృత్తి యయ్యును మొదటినుండి యాట పాటలయందుత్సాహము మెండు. బొబ్బిలి భరతశాస్త్ర భరతనాట్య పద్ధతులు మాత్ర మపూర్వములు, అనుపమానములనుటలో సందేహము లేదు.

ఒకనాడు నేను నా సహాధ్యాయులును "ఆంధ్రపత్రిక" చదువుచుండగా నందొకచోట "ఈశ్వరపంచముఖి ప్రదర్శనము" అను విషయము మున్నది. అదేమియోయని యామూలాగ్రముజదివితిని. అందిట్లున్నది.

"ఇయ్యది యీశ్వరప్రదర్శితమగు పంచముఖి. దీనిని నేనతికష్టముతో నభ్యసించి సాధించి ప్రదర్శించితిని. ఐదంగములతో నైదుజాతులను తుంచ. తప్పక సాహిత్యస్వరశబ్ద కల్పనతో నెవరేని నావలె ప్రదర్శించినచో వారి వామపాదమునకు నాచేతితో నిండుసభలో గండపెండేరము తొడిగెదనని సవాలు చేయుచున్నాను. ఇట్లు హంకథాపితామహుడు శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాసుడు."

అను విషయము జదివియాశ్చర్య చకితులమై మాతండ్రిగారితో నీ విషయము చెప్పగా వారు చాలా కష్టతరమైన విషయమనిచెప్పుచు మన భరతశాస్త్రమున నీ పద్ధతులన్నియు శాస్త్రోక్తముగా నున్న వనియు, నవి చూడుమని చెప్పగా మరల తాళపత్ర గ్రంధమును పరిశీలించితిని. మృగ పక్షి నాట్య విధులును, బ్రహ్మ విష్ణు మహేశ్వ రాంజనేయ పంచముఖి షణ్ముఖి శబ్దజాలంబులును, ప్రదర్శింపబడు విధానమును, వినాయక శివభవానీ కౌతుకశబ్దోత్పత్తి విధానం బును, చూళాద్యేకోత్తర శతతాళాంగక్రియాజాతి నియమములను సప్రమాణముగ నున్నవి. ఆ విషయములన్నింటిని మా నాన్నగారి నడిగి తెలిసికొని యీ పంచముఖి వేయుట మనకేల సాధ్యముకాదను దీక్షతో తదభ్యాసమునకు బూనుకొంటిని.

పరమేశ్వరానుగ్రహముచేతను మా తండ్రిగారియాశీః ప్రభా వముచేతను, నాకారు మాసములలో నారాయణదాసుగారు సవాలు చేసిన పంచముఖి ప్రదర్శనము సాధ్యమయ్యెను. పిమ్మట నీ విష యము మాతండ్రిగారి సమక్షమున నా సహాధ్యాయులు చూచు చుండగా సాహిత్యశబ్ద కల్పనలతో తు. చ. తప్పక నిర్దుష్టముగ ప్రద ర్శించితిని. తరువాత కొంతకాలమునకు బ్రహ్మ, విష్ణు, ఆంజనేయ పంచముఖులను గూడ అనగా షట్కాలషణ్ముఖి మున్నగునవి గూడ శారదా కటాక్షమున నభ్యసించి నిర్దుష్టముగ ప్రదర్శించితిని. పంచ ముఖి ప్రదర్శనలలో దోషమిసుమంతయు లేదని మా నాన్నగారిచే ననిపించుకొని యొక దినమున నా సోదరునితో కలసి విజయ నగరమేగి నారాయణదాసుగారిని దర్శించి వారి సన్నిధిని నియ్యది ప్రదర్శించితిని. ఆ మహానుభావుడు బ్రహ్మానందమంది "నాకన్న కష్టించి షట్కాలషణ్ముఖింగూడ ప్రదర్శించితివి. సెబాసు! గట్టివాడవు. అమా నుషమైన యీ విద్యను నిర్దుష్టముగా ప్రదర్శించితివి" యని సంతోష మును వెలిబుచ్చిరి. ఆనాటిరాత్రి స్వర్గీయ ద్వారము వేంకటస్వామి

నాయుడుగారి దగ్గరకేగి శిష్యులతోనున్న వారి సమక్షమున గూడ ప్రదర్శించి నిర్దుష్టములని యనిపించుకొని నీ విద్యల కష్టమునకు దేశమున స్థానము లేదుకదా యని నిరాశా నిస్పృహాలతో గొన్ని సంవత్సరములుండవలసి వచ్చెను.

ఇట్లుండ నాంధ్రప్రదేశ మంతటను కృష్ణపాత్రధారణలో నఖండ ఖ్యాతి నార్జించి స్వర్ణకిరీటమును బహుమతిగా బడసిన నా మేనల్లుడు చిరంజీవి పీసపాటి నృసింహమూర్తి నన్నెంతో యొత్తిడిచేసి ప్రోత్సహించిన ఫలితముగా కొన్ని సంవత్సరముల క్రిందట విజయనగరమున రాఘవ స్మారక దినోత్సవ సందర్భమున భరతకళా ప్రపూర్ణ బిరుదాంకితులగు నటరాజ రామకృష్ణగారి యధ్యక్షతను జరిగిన మహాసభలో పంచముఖ్యాదులను ప్రదర్శించు భాగ్యము ప్రాప్తించినది. ఆ ప్రదర్శనమున నాకడసారితమ్ముడు సాంబమూర్తి మృదంగమును వాయించెను. అయ్యది రామకృష్ణగారు చూచి ముగ్ధులై వెంటనే టేపురికార్డుచేయించి యమానుష కార్యములను సాధించితినని సభలో చెప్పి నా యదృష్టరేఖకు మెరుగు కల్పించిరి. వారికెంతయుఁ గృతజ్ఞుడను. తరువాత ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ హైద్రాబాద్‌లో ఏర్పాటు చేసిన యుత్సవములలో శాస్త్రజ్ఞుల పండితుల సన్నిధానమున పంచముఖి ప్రదర్శనము గావించుటకు రామకృష్ణగారు అవకాశము కల్పించిరి. ఆ ప్రదర్శనమున నా కష్టమును గ్రహించి సంగీత నాటక అకాడమీ అప్పటి అధ్యక్షులు ఆర్. బి. రామకృష్ణరాజు గారును, గౌరవకార్యదర్శి పసలసూర్యచంద్రరావుగారును, కార్యవర్గ సభ్యులు కంభంమెట్టు వెంకటసుబ్బారావుగారును, నా ప్రదర్శనము ననేక విధములుగా ప్రశంసించి సంపూర్ణాభిమానులైరి. అకాడమీలో ఒక విశిష్టసభ్యునిగా నన్ను స్వీకరించిరి. పంచముఖి షట్కాలషణ్ముఖి ప్రదర్శనమునకు, బ్రహ్మ విష్ణు మహేశ్వ రాంజనేయ పంచముఖులకు శాస్త్రరీత్యా ప్రమాణము కలదా యనియు, నున్నచో మాకా

శాస్త్రము చూపిన నపూర్వములును, నమానుషములు నగు నీ విషయములు గల గ్రంథమును ప్రచురించెదమని అకాడమీవారు కోరినారు. కాని నాభరతశాస్త్రగ్రంథములన్నియు 1931 వ సంవత్సరము అనగా ప్రజోత్పత్తినామ సంవత్సరమున వర్షాధిక్యముచే సంభవించిన వరదలవలన నిండ్లలోనికి నీరుచేరి తడిసిపోవుటచే బూజుపట్టి గ్రంథస్థములగు శ్లోకవాక్యములును పదములును వర్ణములును గొన్ని కొన్ని యచ్చటచ్చట కనపడుకుండపోయినవని వారితో చెప్పి, నాతమ్ములు సాహిత్యవిద్యాప్రవీణ ముట్నూరు సూర్యనారాయణశాస్త్రి, ఉభయభాషాప్రవీణ సూర్యప్రకాశశాస్త్రి, నామిత్రులు సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ వడ్లమాని ఈశ్వరశర్మగారు, కళాప్రియులగు రేజేటి గోపాలరావుగారు అను నల్వుర సహాయముతో "నందీశ్వరభరతము" న లుప్తములగు పదముల నచ్చటచ్చట సవరణ చేయించి గ్రంథమును మరలవ్రాయించ నుపక్రమించితిని.

పిదప సంగీతనాటక అకాడమీ అధ్యక్షులు వసలసూర్యచంద్రరావుగారు సంయుక్త కార్యదర్శి కంభంమెట్టు వెంకటసుబ్బారావుగారల అభిమానముచే తాడేపల్లిగూడెం, ఏలూరు, వరంగల్లు, విశాఖపట్నము మున్నగు నగరములలో పండితసభలలోను, మద్రాసు మ్యూజిక్ అకాడమీ నిపుణుల సంఘం ఎదుటను నీపంచముఖి, షట్కాల మణ్ముఖి ప్రదర్శనములను నాతమ్ముడు సాంబమూర్తి మృదంగ వాద్యముతోను, మృదంగమును భరతశాస్త్రమును నభ్యసించిన నా ప్రథమశిష్యుడు గుజ్జల సీతారామమూర్తి యను సహాయమార్దంగికునితోను ప్రదర్శించి మనీషుల మన్ననలకు పాత్రుడ నైతిని.

నేను ప్రదర్శించు పంచముఖ్యాది తాళములు శాస్త్రీయము లని ఈ "నందీశ్వర భరత" మను గ్రంథము రుజువు పరచుచున్నది.

ఈ గ్రంథమున భరతోత్పత్తియు, వినాయక శివభవానీ కౌతుకములు, మృగపతి నాట్యవిధాన శబ్దజాలము లనెడి యొకటవ యధ్యాయము పంచముఖి తాళవిధానంబును, రంభానాట్యసప్త తాళంబులనెడి రెండవ యధ్యాయము, ఏకోత్తర శతతాళంబులు, జాతివిభాగ క్రియాగణ నియమాదులనెడి మూడవ యధ్యాయము గలవు. ప్రతియధ్యాయమున గల శ్లోకములకు నాసోదరులచే సంగ్రహముగా తాత్పర్యమును వ్రాయించి యా యా కౌతుక నాట్యాదులకు గల శబ్దముల నిందు పొందుపరచితిని. దీనియందు దోషములున్న నాకు దెల్పినచో సవరణ చేసికొందునని మనవి చేయుచున్నాను. మరియు నిందునాసోదరుల మినహాయించి నాకష్టమును గూర్చి పాటుపడి యీవిద్యను ప్రచారము లోనికి తెచ్చుటకు కారణభూతులైన నటరాజరామకృష్ణగారికి, పసల సూర్యచంద్రరావుగారికి, కంభంమెట్టు వెంకటసుబ్బారావుగారికి వడ్లమాని ఈశ్వరశర్మగారికి, రేజేటిగోపాలరావుగారికి నా కృతజ్ఞతా పూర్వకాభివందనము లర్పించుచున్నాడను.

బుధజనవిధేయుడు

ముత్నూరు సూర్యనారాయణశాస్త్రి

# నందీశ్వరభరతము

## వినాయకకౌతుక శబ్దోత్పత్తిః

పురా త్రిపురసంహారం కృత్వా దేవో మహేశ్వరః
సర్వదేవగణై ర్యుక్తః జయశ్రీ సమలంకృతః 1

కైలాసాచల మాసాద్య సముల్లసిత మానసః
తన్మహీధరశృంగేషు సౌధాగ్ర మధిరుహ్యా చ 2

ఆనందాతిశయా త్తత్ర నాట్యం చక్రే మహోద్భుతం
ఏతస్మిన్నంతరే తస్య సవ్యపాదాత్తు ప్రచ్యుతః 3

సోపానేషు స్ఖలన్ తాధీతోనేత్యాది విలంబితః
క్రమా త్తత స్సరిగమాది ద్రుతకాలానుగం తథా 4

పదంస్తు నూపురో భూమౌ పపాత మధురం యథా
తన్నాద మద్భుతం శృత్వా శర్వ స్సర్వసుఖప్రదః 5

తాళశబ్దా ననంతాంశ్చ స్వరశబ్దాం స్తథై వచ
రాగతాళ ప్రయుక్తాంశ్చ మధ్యే సాహిత్యసమ్మితాన్ 6

ప్రణీయ రసపుష్టాన్ వై కౌతుకా దీశ్వర స్తదా
కదాచి దుమయా సార్థం పుత్రేణాదిపురాంతకః 7

హంస సారస కాంతాబక చక్రాదిభిః ఖగైః
నీలోత్పలైశ్చ కల్హారైః తథా కోకనదాదిభిః 8

ప్రఫుల్లపద్మపత్రైశ్చ ప్రసన్నమధుసుగంధిభిః
తీర్థస్థ తరుశాఖాసు కూజద్భిః పక్షిశాబకైః 9

అనావిలపయఃపూర్ణై ర్వ్యాదోభి రుపశోభితం
కాసారం మానసం గత్వా తీరే వాయునిషేవితః 10

అగజాగజముఖాభ్యాం స వ్యచర న్ముదితః పరం
తత్సరోవరమధ్యే వై మృదునాళా న్మృణాళికాన్ 11

జగ్ధ్వా కలం రువంతశ్చ వరటాకృష్టమానసాః
రాజహంసా నటంతిస్మ తరంగేషు ముహుర్ముహుః 12

వినాయక స్తదాలోక్య తన్మే బ్రూహి జగద్గురో
ఇతిస్మ జనకం ప్రాహ పార్వతీప్రియనందనః 13

విచింత్య కౌతుకం తత్ర విఘ్నేశస్య శివ స్తదా
జాతౌచ చతురస్రాయాం తాళే హి త్రిపుటాభిధే 14

తాళాంగే తు ద్వితీయే హి కాలే శబ్దం చకార సః
తాత్తై కిటత్కఝుంతాది మధ్యేసాహిత్య సంస్కృతం 15

తన్నాట్యం బోధయామాస శివ స్తద్రాగరంజితం
విఘ్నేశస్య తదారభ్య శ్రీవినాయకకౌతుకం 16

నాట్యశబ్దోపి తన్నామ్నా లోకేపి ప్రథితోభవత్
శృత్వా హంసధ్వనిం గానాత్ రాగో హంసధ్వనిస్స్మృతః 17

త్రిపుటో ప్యాదితాళోసౌ ఆదాయ చ్ఛంబునా ధృతః
తత్సర్వ మీశ్వరే ణేత్థం ఉపదిష్టం మహాత్మనా 18

నందిభృంగిరిటాదీనాం సదా పార్శ్వప్రవర్తినాం
ఋషీణాం నారదాదీనాం దేవలోక నివాసినాం 19

భూలోకవాసినాం భావరాగతాళవిదాం తథా
భరతాదిమునీనాం వై క్రమా చ్ఛాస్త్రం ప్రవర్తితం 20
యత్రోక్తం భరతేనాత్ర తస్మా ద్భరతముచ్యతే
ఏవం లోకత్రయే వ్యాప్తం శాస్త్ర మీశ్వరకల్పితం. 21

## వినాయక కౌతుక శబ్దోత్పత్తి వివరణ

నందీశ్వర భరతమున ప్రథమాధ్యాయమున వినాయక కౌతుక శబ్దోత్పత్తి నిరూపింప బడుచున్నది.

పూర్వమొకప్పుడు త్రిపురసంహార మొనర్చి జయశ్రీ సమేతుడై సమస్తదేవగణములతో కైలాసాగ్రమందలి సౌధాగ్రమున నానందాతిశయముతో నద్భుతంబగు నాట్యము చేయుచుండగా నామహేశ్వరుని యెడమపాదమునుండి రత్నమయమైన నూపురము జారి "తా, ధీ, తో, న" అనుశబ్దముతోను, "సరిగమపధని" అను స్వరములతోను మ్రోగుచు సోపానములనుండి భూమిపైఁబడెను. ఆ మనోహరమగు నాదమును విని యీశ్వరుడు సంతసించి రాగతాళములతో సాహిత్యసమేతముగ తాళ స్వరశబ్దములను రసపుష్టముగాఁ గల్పించెను. పిదప నొకనాడు మహేశ్వరుడు పార్వతీ వినాయకులతో కలిసి వికసించిన కలువలతోను పద్మములతోను, మనోహరమగు పక్షుల కలకల ధ్వనులతోను, నిర్మలవారి పూరములతోను నిండి యున్న మానససరోవరమున కేగి చల్లని పిల్లవాయువులు వీచుచుండగా పార్వతీ వినాయకులతో విహరించెను.

అంత నా సరోవరమందలి తామర తూండ్లను భక్షించుచు, మధురముఁగా గూయుచుఁ దరంగములపై నాట్యముసేయుచు, రాజహంసలుచరించుచుండెను. ఆ సన్నివేశమును జూచి వినాయకుడా హంసల నాదమందలి విశేషమేమని తండ్రి యగు నీశ్వరు నడుగ నీశ్వ

రుడు కుమారుని కౌతుకమును గమనించి రెండవకాలనున చతురస్ర జాతి త్రిపుటతాళమున "తాతై కిటతకఝుం తతకిటతక" యను శబ్దమును కల్పించి సాహిత్యమునల్లి వినాయకుని కౌతుకము కోసము ఈశ్వరుడు సృష్టించెను. కాన నియ్యది వినాయక కౌతుక మనబడు చున్నది. హంసలధ్వని కారణముగా చెప్పబడుటచే హంసధ్వని యను రాగమున గానముచేసి శబ్దము పట్టెను. చతురస్రజాతి త్రిపుట తాళము ముందుగా నీశ్వరునిచే చెప్పబడినది గాన ఆ తాళము నేటికిని ఆదితాళమనే వ్యవహరింపబడు చున్నది. ఆ తాళ రాగ శబ్దాదు లన్నియు నీశ్వరుడు నంది భృంగి మున్నగు వారికిని, నారదాదిదేవ మునులకును, భరతమునికి నుపదేశించి భూలోకమున వ్యాప్తిచేయు మనెను. అంత భరతముని శాస్త్రమును ఈశ్వరాజ్ఞానుసారము సమస్తమైన వారికి కల్పించి యిచ్చుటచే నీశాస్త్రమునకు భరతమను పేరు సార్థకమైనది. ఆ శబ్దమిచ్చట వ్రాయబడుచున్నది.

తాతై + కిటతకఝుంత తకిటతక తాతై + ధిరుగుడుతత్త తకిటతక తాతై + ధిరుగుడు తత్త తకిటతక + తాకిటతకతై + ధత్తిత్తై + కిడతకతై + ధిత్తిత్తై + ధత్తత ధత్తత్తాహాం ధత్తాను తకిట కిణ తోంగ ధిగితాం తోంగిరి + తోంగిణ కిటతకణంగిట కిటతకణం గిటకిటతక దీందాం = నుత కిటకిణతోం గధితాంతోంగిః + తాతోం గిరి + తోంగిరి + కిటతక అధత్తా + ధిరుగుడుదం దంధికుందరి ధిక్కిట కిటకత ధికుతక హరిజన కరిముఖ విఘ్న వినాయక వెనుకటి హరిలవ గణపతి జే జే ఝుక్కిటను తరితఝం + ఝేఝుక్కిటను తరి తఝు + కణ్ణం + తోధిక్కు తోధిక్కు యానదికౌతం + తోంగిట కిటతకతోంగు తక దేవరగణపతి + ధిక్కిట కిటతక ధికుతకగణపతి కౌతం + కత్యోర్వినియా + తక్కుతుతా + ధిక్కుడుధీ + తక్కు ధిక్కు తక్కిటు + తోంగిట కిటతక ధే—నత్తోంగిః కిటతక ధిక్కిత్తా = అధత్తా + తాకిటతక తక్కిట కిడతక తదిద్ధి తా + ధాధా కిట తక

తక్కిట కిడతక తదిద్ది తా + తాకిడతక ఝుం + ధాధాకిట తకఝుం +
తాకిట తక ధాధా కిడతక ధాధా కిటతక తకదధిగిణ తోం. తాకిట
తక ధాధాకిటతక ధాధాకిట తకతక దధిగిణతోం. తాకిటతక ధాధా
కిడతక ధాధా కిటతక దధిగిణతోం ॥తాతై॥

## అథ శివకౌతుక శబ్దోత్పత్తిః

కదా చిద్దేవ గంధర్వాః రంభాద్యప్సరస స్తథా
త్రిపురాసురసంహార ముగ్రరూపధరమ్ శివమ్॥ 1

దూరా దాలోక్య సంత్రస్తాః తతో్కవ ప్రశమార్థినః
తుష్టువు స్తంహి సర్వేపి వాగ్భి రర్థ్యాభి రుత్తమాః॥ 2

తత్ర రంభా చాదితాళే తృతీయే కాల ఏవహి
శంకరాభరణరాగేణ తాళ శబ్దంతు సంగతం॥ 3

కల్పయంతీ శివప్రీత్యై చక్రే నాట్యం మహాద్భుతం
శివస్య కౌతుకాధానాత్ శివకౌతుక ముచ్యతే॥ 4

## శివకౌతుక శబ్దోత్పత్తి వివరణము

త్రిపురాసుర సంహారానంతరమున మహోగ్రరూపుండగు నీశ్వరుని దేవతలు, గంధర్వులు, రంభాద్యప్సరసలు దూరమునుండియే చూచి మహాభయమునంది మహేశ్వరుని కోపోపశమనమునకై యందఱును ననేకవిధములుగా స్తోత్రముచేసి ఈశ్వరుని సంతోషపెట్టిరి. ఆ సమయమున రంభ శంకరాభరణ రాగముతో మూడవ కాలమున ఆదితాళమున గానముచేసి నిరుపమానమగు నాట్యమును శబ్ద సంగతముగా ప్రదర్శించి ఈశ్వరునకు కౌతుకము కలుగజేసెను. అందుచే దీని శివకౌతుకమను పేరువచ్చెను. ఆ శబ్దమే యిచ్చట వ్రాయబడుచున్నది.

## శబ్దము

తక్కిటకిత తక ధిక్కుడు కిటితక తాండవవినోదా-ధిక్కిట కిట తక తక్కిట కడతక త్రిశూల ఢమరుక తద్దిమిధిమి తద్దిమి ధిమి తద్దిమి = వినుతా శంకర త్రిపురసంహార! నందివాహనా! నాగభూషణా! ధేకుకు తక ధేకుకు తక ధేకుకు పార్వతిరమణా! భక్తవత్సలా! గంగాధర! శంకరా! తత్తత్తత్త త్తక్కిట కిడతకతదిద్దితా + తక్కిట దిక్కిట తక్కిట కిడతక తదిద్దితా + తక్కిట ధిక్కిట తక్కిట కిడతక ధిక్కిట త క్కి ట త క్కి ట కి డ త క తక్కిడతక ధిక్కిట తక ధిక్కిట తక తక్కిట తత్తక్కిడతక తక దధిగిణ తొం, తక్కిట ధిక్కిట తక్కిట కిడతక ధిక్కిట తక్కిట తక్కిట కిడతక తక్కిడతక ధిక్కిడ తకతక్కిట తత్తక్కిట తక తగ దధిగిణతొం. తక్కిట ధిక్కిట తక్కిట కిడతక ధిక్కిట తక్కిట కిడతక తక్కిడ తక ధిక్కిడ తక తక్కిట తత్తక్కిడతక తకదధిగిణతొం॥

## భవానీకౌతుక శబ్దోత్పత్తిః

ఆసీత్పురా కృతయుగే మహిషో నామ దానవః<br>ఉగ్రేణ తపసారాధ్య పితామహ మతోషయత్॥ 1

తస్మాత్ ప్రాప్తివరో భూత్వా దృప్తస్సురిభయాతుసః<br>చతుర్దశ భువనాని యథేచ్ఛం బాధతే భృశం॥ 2

ఇంద్రాద్యా లోకపాలాశ్చ బ్రహ్మావిష్ణుమహేశ్వరాః<br>ఏకత్ర సమవేతా వై సహదేవగణైస్తథా॥ 3

ఆప్తుకామాశ్చ తే శక్తిం రక్షస్సంహారకారిణీమ్<br>శాస్త్ర దృష్టేన విధినా యాగం చక్రుర్మహారాజః॥ 4

పూర్ణే హోమే తు తద్ధోమకుండా దావిర్బభూవ హా<br>సింహాసంవాహనా శక్తిః బహుబాహుబలాన్వితా॥ 5

అభయం సర్వదేవేభ్యః దత్వా త మవధీ ద్రుషా
నృత్యంతీం మస్తకే తస్య హాసంతీ మంగకంపనైః॥ 6

కుపితాం వీక్ష్య తాం దేవీం తత్ప్రసాదాభిలాషిణః
బ్రహ్మాద్యా స్సర్వదేవాశ్చ రంభానాట్య మకల్పయన్॥ 7

బ్రహ్మా తాళధర శ్చాసీత్ వాణీ వీణానినాదినీ
మృదంగనాదకో విష్ణుః బభూ వాచార్యక శ్శివః॥ 8

తత్ర వంశప్రదాతారౌ దివాకర నిశాకరౌ
గంధర్వ స్తుంబురు స్తత్రాభవ త్సంగీతకారకః॥ 9

ఏతస్మిన్నంతరే రంభా భైరవీ రాగ రంజితం
తాళాంగం కాలమాశ్రిత్య తృతీయం చాదితాళకే॥ 10

తథ్ఝుంత తకఝుంతేతి తాళశబ్దం ప్రకల్ప్యచ
యన్నాట్య మకరో త్తత్ర భవానీప్రీతిహేతవే॥ 11

తదాలోకనమాత్రేణ భైరవీ జాతవిస్మయా
ప్రసన్నవదనా భూత్వా శివపార్శ్వ ముపాగతా॥ 12

భవానీకౌతుకార్థం వై చకా రాద్భుతనాట్యకమ్
భవానీకౌతుకం చేదం అభూత్ లోకే హివిశ్రుతమ్॥ 13

## భవానీకౌతుక శబ్దోత్పత్తి వివరణము

పూర్వకాలమున కృతయుగమున మహిషాసురుడను రాక్షసుడు అఖండంబగు తపంబొనరించి బ్రహ్మదేవుని సంతోషపెట్టి యా విధాత వలన సమస్త వరములు వడసి గర్వించి పదునాల్గుభువనములను నిరంకుశుడై బాధించుచుండెను. అంత బ్రహ్మవిష్ణు మహేశ్వరులు, ఇంద్రాదిదేవతలు నొకచో సమావేశమై మహిషాసుర బాధల ననుభవింపలేక యాతని సంహరించు శక్తి బొందుటకై యథాశాస్త్రముగా

నొక యాగమునొనర్చిరి. యాగము పూర్తియగుసరికి హోమ కుండమునుండి యనేకబాహుబల సమన్వితయై సింహము నధిష్ఠించి మహాశక్తి యవతరించి కోపముతో నా మహిషాసురుని సంహరించి సమస్త దేవతలకు నభయ మొసంగెను. అంత రాక్షసునిపై నృత్యము చేయుచు నవ్వుచు భయంకరముగానున్న యాశక్తినిజూచి యామె యనుగ్రహమునకై ఆ బ్రహ్మాదులు రంభచే నాట్యప్రదర్శనము గావించిరి. ఆ ప్రదర్శనమున బ్రహ్మతాళమును, వాణి వీణను, విష్ణువు మృదంగమును బట్టిరి. ఈశ్వరు డాచార్యుడై యుండెను. సూర్యచంద్రులు వేణునాదమును బూరించిరి. తుంబురుడు సంగీత మును బాడుచుండెను. అట్టిసమయమున రంభ మూడవకాలమున ఆదితాళములో "తర్ఝుం తకఝుం" అను శబ్దమును గల్పించి భైరవి రాగముతో నాట్యమొనర్చి భవానీ శక్తిని కౌతుకపఱచెను. వెంటనే భవాని సంతసించి ఈశ్వరుని వామభాగమునఁ జేరెను. భవానీదేవి కౌతుకమునకై నాట్యము చేయుటచే దీనికి భవానీ కౌతుకమను పేరు వచ్చెను.

"తర్ఝుం తకఝుం" అను శబ్దమీదిగువ వ్రాయబడుచున్నది.

## శబము

తర్ఝుం + తకఝుం + తారికిణఋగఝుం + ఋగఝుం తకఝుం ఝుం తగఝుం + తహాతదీద్ధి దిందా కుణగఝుం + తగ జగణ గణం + ధిణ్ణా + ధిం ధిం ణణ్ణా + ధిం ధిం ధి రి తధణాం + దణాం + కిణాం + ఝు ఝుం + ధి మిం ధిమిత — + ధీం ధిం ధిమి + థాం థాంధణ + ఝేం ఝేం ఝుఝు_ధిమింధిమిత ధింధిం ణణ్ణా + ణణ్ణతఝుం + మితి మిట్ట దణం టుడణం తగ జగణం గత్తో + కి ణ్ణాం + కింకింణణ్ణా + కిణ ణగ జగ_జగ ణగతగ_తగజగ ణగణం గత్తోం గధిరుగుడుతకః దదిగిణత + ధిరుగుడు తకః దధిగిణత +

ధిరుగుడు తకః దధిగిణత + గౌరీ + మదమహిషాసుర సంహారి మము కరుణజూడు మీసారి + అయిసాంబశివుని కామారీ + హేత్రిపుర సుందరీ పరాక్ + తారిః తారిః కిడతక తగణం కిడతక ఝేం ఝేం దధిగిణత + తారిః తారిః కిడతక తగణం కిడతక ఝేం ఝేం దధిగిణత + తారిః తారిః కిడతక తగణం కిడతక ఝేం ఝేం దధిగిణత ॥ఝం॥

## కురంగనాట్యశబ్దోత్పత్తివిధిః

పురా మేరు సమీపే తు పార్వతీపరమేశ్వరౌ
కృష్ణభూమౌ విశాలాయాం విహారం కురుతః ముదా॥ 1

శతశః కోటిశశ్చైవ వివిధైశ్చ గతాగతైః
కృష్ణసారమృగాణాం హి యూథాని సమపశ్యతాం॥ 2

దృష్ట్వా చ పరమానంద మవాప గిరిజాపతిః
పార్వతీపరితోషాయ ప్రియే నాట్యం కరోమ్యహం॥ 3

యథా తుల్యం కురంగాణాం వివిధైశ్చ గతాగతైః
దృశ్యతాం చిత్ర మిత్యుక్త్వా రాగం సారంగ నామకమ్॥ 4

ఆదితాళే తాళశబ్దం తద్ధణేత్యాది కల్పయన్
నాట్యం కృత్వా తు తత్తుల్యం తోషయామాస పార్వతీం॥ 5

క్రమేణాధ్యాపయామాస తత్సర్వం సుతయోశ్శివః
కుమారలంబోదరయోః మహామేధాభిరామయోః॥ 6

తదైవ నందికేశస్య కురంగాఖ్యాత నాట్యకమ్
భువి ప్రావర్తితం చైతత్తన్నామ్నా భరతాదిభిః॥ 7

## కురంగనాట్య శబ్దోత్పత్తివిధి వివరణము

పూర్వకాలమున మేరుపర్వత సమీపమున పార్వతీపరమేశ్వరులు సంతోషముతో విహరించుచు వివిధగతులతో వేలకొలది కోట్లకొలది

సంచరించు లేళ్ళ సమూహమును జూచిరి. ఆ కురంగముల వివిధ గతులజూచి మహానందముతో పార్వతిని సంతోషపెట్టుటకై పరమేశ్వరుడు కురంగగమనానుసారముగా నాట్య మొనరించెను. ఆ నాట్యము సారంగరాగముతో నాదితాళములో "తద్దణ" అను శబ్ద కల్పనతో పార్వతిని సంతోషపెట్టెను. పిమ్మట ఆ నాట్యమును వినాయక కుమారస్వాములకు, నందికేశ్వరునకు, భరతమునికి నుపదేశించి భూలోకమున వ్యాపింపజేసెను. కాన దీనికి కురంగనాట్యమను పేరు వచ్చెను.

## శబ్దము

తద్దణ తకఝణు + ఝణుతకధిమి + ధిమితకగధి + గధితక ధరి = తద్దణతక + తఝణుతక + తద్దిమితక + గ్ధితక తద్దరితక ధణ తధణ తతఝణు తతధిమి తతగధి తధణ తఝణుతధిమిత గధి తత కుందరి = తోంతరిత తక తకుందరికిత తక + ఝుం ఝణుత తకఝుం తరి కిడతక = తాంతరిత + ఝేంఝణుత తకుందరి తదధిగిణత ధధిగిణత దధిగిణత + దధిగిణత దధిగిణత + దధిగిణత + దధిగిణతదధిగిణత. తాం ఝుంత + తక ఝుంత + రిధణాంత + రిధణ తకిట + తాంతరిత ఝణు + తోంతరితధిమి + ణుంతరితగధి + ధింతరితరి + ఝుంతరితతక = తధ ణతాకు రిధణ ఝుకు తధగిణ తకుకు తెయ్యా తతెయ్యా. రితారి గధిన్న గధిన్నరిఝుం—తరి ధాంధణ ధీంధిమి తాంతరి ఝుంత గణాంతకిటతద్దిరుగుడు తకధిరుగుడు ధరుగుడు ధరికిడతక + కిడతక ధరిగిడతక + కిడతక ఝుకిడతక + కిడతక ధి కిడతక + దధిగిణతా దధిగిణతా తధిగిణతా. తద్దిరుగుడు తకదిరుగుడు ధరుగుడు ధరికిడతక + కిడతక ధరిగిడతక + కిడతక ఝుకిడతక + కిడతక ధింకిడతక + దధిగిణ తాదధిగిణ తాదధిగిణతా. తద్దిరుగుడు తకధిరుగుడు ధరుగుడు ధరికిడతక + కిడతక ధరిగిడతక + కిడతక ఝుకిడతక + కిడతక ధింకిడతక + దధిగిణతా దధిగిణతా దధిగిణతా

ధిరుగుడు తత్తతకిట, ఝుంతకుంతరిత, ధరికిడతక ధీన్న।
కిడతా॥ ధరికిడతక ఝుంతరికిడతక తకిట ధిన్నా ధికిట ధీన్నాది+
ధరికిడతకఝూ+ధినతఝూ+ధీన్నా+ధరికిడతక ధిరుగుడుతాం+
ధిరికిడ తఝుం+ధరికిడతకతోం+ధరికిడతక దిత్తళాంగు తదింకు
తక+తఝుకుతక+ధరేకుతక+ ధణేకుతక + దధిగిధతోం+
తాం+ధరికిడతక ఝుం + ధరికిడతకతోం+ధరికిడతక ధిత్తళాంగు
తధింకుతక+తఝుకుతక+ధరేకుతక+ ధణేకుతక దధిగిణతోం+
=తాం+ధరికిడతక ఝుం+ధరికిడతకతోం+ధరికిడతక ధిత్తళాంగు
తధింకుతక+తఝుకుతక+ధరేకుతక+ధకుణేతక+దధిగిణ తోం॥

## మయూరనాట్య శబ్దోత్పత్తి విధిః

కదాచి చ్చంపకారణ్యే శర్వాణ్యా సహిత శ్శివః
స్వమాయాశక్తి సంసృష్టాం ప్రకృతిం బహుధాత్మికాం॥ 1
ముహుర్ముహు ర్వీక్షమాణః పరమానందతుందిలః
తత్తద్విచిత్రవిషయాన్ యావ ద్వక్తుం ప్రచక్రమే॥ 2
తావదేవాభవ ద్వ్యోమ నీలనీరదసంవృతం
ఆచ్ఛాదితం సూర్యతేజః విద్యుద్గణ విభాసితం॥ 3
అత్రాంతరే సమాసేదుః సర్వదిగ్భ్య స్సహస్రశః
నీలనీరదసందర్శనోద్భూతానందతుందిలాః॥ 4
పిచ్ఛాన్ విస్తృత్య సర్వత్ర మండలాకారసంస్థితాః
మధురం షడ్జ మాశ్రిత్య స్వరం కూజంత ఏవ హి॥ 5
విచిత్రం తత్ర నృత్యం తు కుర్వంతిస్మ ముదాన్వితాః
మయూరాశ్చ మయూర్యశ్చ నీలకంఠా స్సుసంయుతాః 6
తద్దృష్ట్వా నీలకంఠోయం పార్వతీసహిత స్తదా
తన్మధ్యగః తత్సమం హి స్వయం నృత్య మథాకరోత్॥ 7

తఝుంతతక ఝుంతేతి శబ్ద ముచ్చార్య తత్ర హి
నాట్య మేత త్తదారాభ్యమాయూరంహి ప్రచక్షతే॥ 8
శివాలయేషు సాయాహ్నే య ఏతన్నాట్య మద్భుతం
కుర్వంతి వాథ పశ్యంతి తే ధన్యాఃఖలు పార్వతి! 9

## మయూరనాట్య శబోత్పత్తి వివరణము

ఒకానొకప్పుడు పార్వతీ సహితుడై పరమేశ్వరుడు స్వమాయాపరికల్పింతంబైన సృష్టివైచిత్ర్యంబు నరసి పరమానందభరితుడై ఆ యా సృష్టి విచిత్ర విషయములను చెప్పుటకారంభించు నంతలో దుర్నిరీక్ష్యమగు సూర్యతేజస్సును గప్పి యాకాశము నీలమేఘావృత మయ్యెను. అంతలో నానాదిక్కుల నుండి నెమిళ్లు నీలనీరద సందర్శనముచే పరమానందమంది పింఛములను విప్పి వలయాకారములై షడ్జ స్వరమున శ్రుతిసుఖముగాఁ గూయుచు విచిత్రమైన నృత్య మొనరించెను. ఆ నాట్యమును ఆడ నెమిళ్ళు మగ నెమిళ్లు సంతోషముతోఁ జేసెను. అట్టి నృత్యమును పార్వతీ సమేతముగా నీలకంఠుడు చూచియు నీలకంఠముల నృత్యమునే మనము గూడ చేయుదమని నిశ్చయించి వలయాకారముగా నున్న మయూరముల మధ్య కేగి "తఝుం తకఝుం" అను శబ్దముతో నతి రామణీయకముగా నొనర్చెను. కనుకనే దీనికి మయూర నాట్యమను నామము గల్గినది. శివాలయములందెవరీ నాట్యమును సాయంసమయమునఁ జేయుదురో వారును, ఎవరు చూచెదరో వారును ధన్యాత్ములగుదురని పార్వతితోఁ జెప్పెను. ఆ శబ్ద మీక్రింద గలదు.

## శబ్దము

ధః + ధణధః + ఝుణుధః + ధిమిధః + గధిధః + ధరిధః + ధణధః. ఝుణుధః-ధిమిధః-గధిధః-ధరిధః. ధధతకఝుణు తక్ధిమితక గధితక ధరితక తకిణ దధిగిణత =

తత్తధింకుతక + తధింకుతక + తధిం దింకుతక ధింకుతక = తఝుం—తరికుం—తరిధాం—ధఝ్ఝుం—ధణ తాం—తకిటతక = గధిం ధిమి తకిట — తద్దణా + తఝుణు + తద్ధిమి + తగ్గధి + ధరికిడతక ఝుంతరి దధిగిణతోం — తద్దణా + తఝుణు + తద్ధిమి + తగ్గధి — ధరి కిడతక ఝుంతరి దధిగిణతోం-తద్దణా + తఝు ణు + తద్ధిమీ + తగ్గధి + ధరికిడతక ఝుంతరి దధిగిణతోం = తకిటధణం దణ తాహతకుంతక కుంతః + కుకుంతః + కి ణకు ఝ్ఝుకు తక - దధణధణతఝుణు + ఝుణు ఝుణు తధిమి + ధిమిధిమి తగధి + గధి గధి తధరి + ధరి ధరిత తక = తధణత తక — తఝుణుత తక— తధిమితతక—తగధితతక—తధరిత తక = తధణత - తఝుణుత - తధిమిత—తగధిత—తధరిత — త + కి—ట— త—క—ద—ధి—గి—ణ—త-త. కిట త. త. ద. ధి గి. ణ. త—తకిట తక దధిగిణత.

## తంతువాయనాట్య శబ్ద విధిః

కైలాసశిఖరే రమ్యే నానాతరువిరాజితే
మందార తరుమూలేచ రత్న సింహాసనోపరి॥ 1

ఆసీన శ్శ్రీమయాశర్వః కుర్వన్నాధ్యాత్మికీః కథాః
తత్తరో ర్మధ్యభాగేతు శాఖాయాంచ విచిత్రకం॥ 2

జాలం కృత్వా స్వయం తత్ర తంతుభి ర్బహుభిః పృథక్
ఆరోహణావరోహాది క్రమేణైవ ముహుర్ముహుః॥ 3

జాలమూలాగ్రమధ్యేషు విహారంతం ముదాన్వితం
విచిత్రా హి విధేః సృష్టి రితి లోకస్య దర్శకమ్॥ 4

తంతువాయం తత్ర దృష్ట్వా స్వయ మానందతుందిలః
ఈశ్వర స్సహసోత్థాయ పశ్యత్పార్వతి విస్మయమ్॥ 5

లూతాయా స్తంతుసంతానమధ్యగామ్యా యథా గతిః
ఇత్యుక్త్వాథ మహాదేవః తంతువాయగతాగతమ్॥ 6

అనుకుర్వ న్నాదితాళే గౌళరాగేణ రంజితం
ప్రకల్పయన్ తాళశబ్దం తారి తతేరీతి సంజ్ఞకమ్॥ 7

యన్నాట్య మకరో త్తత్ర తదద్భుతమివాభవత్
తదేవం తంతువాయాఖ్యం నాట్యం లోకే హి విస్తృతమ్॥ 8

## తంతువాయ నాట్యశబ్ద విధి వివరణము

పూర్వమొకప్పుడు చిత్రవిచిత్రతరుశోభితంబైన కైలాస శిఖర మందలి మందారవృక్షము క్రింద రత్నసింహాసనమున నీశ్వరుడాసీనుడై వేదాంత విషయములను పార్వతికి జెప్పుచు ఆ మందార వృక్షశాఖ యందొకసాలెపురుగు తంతువులతో చిత్రవిచిత్రంబైన పట్టును నిర్మించి యందు క్రిందికి మీదికి చిత్రవిచిత్ర గమనములతో తిరుగుచుండగా జూచి సంతసించి 'ఓ పార్వతీ ఆ పట్టుపై సాలెపురుగు పర్యటనము గాంచితివా?' యని పల్కి యా సాలెపురుగు గమనాగమనముల ననుసరించి గౌళరాగముతో ఆదితాళములో "తారితరిత" అను శబ్దముతో గానముచేయుచు నద్భుతమైన నాట్యమొనర్చెను. అందుచే దీనికి తంతువాయ నాట్యమను పేరువచ్చెను. ఆ శబ్దమీ క్రింద లిఖింప బడుచున్నది.

### శబ్దము

తారి తరి తరి తరిత తఝుం + తరితరితరి తరిత తఝుం + ది తరి తరి తరిత తఝుం + తరి తరి తరి తతఝుం + రితరి తరిత తఝుం + తరితరిత తఝుం + రి తరి తత ఝుం + తరిత తఝుం + రిత తఝుం + తతఝుం తతఝుం + తతఝుం-తాఝుం-తాఝుం-తాఝుం - తఝుం- తఝుం- తఝుం-ఝుం-తఝుం ఝుంత-కిణం ణం ణరిత - గధిం ధిర

ధింత- త తోం తోం తోంత- ధి తాం తాం తాంత తధిం ధిం ధిం ధింకు-తారి తరిఝుం తకిణ ఝుం-తఝుం ఝుంత-కిణంణంత-గదిం దింత తతోం తోంత -ధితాం తాంత తధిం ధింకు-తఝుంత -కిణంత-గధింత-దితాం త-కతోంత-తధింకు -తఝుం — కిణం-గధిం - ధితాం తతోం— తధింకు తక దధిగిణత, తక దధిగిణత తక దధిగిణత + తఝుం - కిణం గధిం-ధితాం-తతోం-తతోం— తధింకు—తకదధిగిణత, తకదధి గిణత, తక దధిగి ణత + తఝుం—కిణం-గధిం-ధితాం-తతోం-తధింకు + తక దధిగిణత తక దధిగిణత తక తధిగిణత॥

## శల్యకనాట్య శబ్దవిధిః

కదాచి ద్రేణుకానద్యాః తీరే తరువిరాజితే
విహరంతౌ తత్ర తత్ర విచిత్ర విధిచేష్టితమ్. 1

విస్మితౌ బహుధా దృష్ట్వా పార్వతీ పరమేశ్వరౌ
పరస్పరం భాషమాణౌ యావ దానంద మాపతుః 2

తావ దాలోకయామాస శల్యకం పరమేశ్వరః
తద్గతాగత సందర్శనేన సంజాత కౌతుకః. 3

సద్య ఏ వాకరోత్ తత్ర నాట్యం నాట్యవిశారదః
ఝంతేత్యాదికం శబ్దం జంఝుటే రాగ సంయుతమ్ 4

అదితాళేన సంగృహ్య న్యాసవిన్యాసగం తథా
తత ఆరభ్య తన్నాట్యం శల్యకాఖ్య మభూ ద్భువి. 5

## శల్యక నాట్యశబ్ద వివరణము

పూర్వమొకప్పుడు రేణుకానదీతీరమున గల చిత్రవిచిత్రముల నరయుచు, పార్వతీ పరమేశ్వరులు విహరించుచు, ఆనందమంది యొండొరులతో భాషించుకొనుచుండగా మనోహరమగు గమనము

లతో నచ్చట తిరుగాడుచున్న యొక యాలుగును జూచి దాని గమనమునకు సంతసించి వెంటనే నాట్యవిశారదుండగు పరమేశ్వరుండు జంఝోటి రాగముతో నాదితాళమున "ఝుహంత" అను శబ్దము నుచ్చరించుచు మహానాట్య మొనర్చెను. కాన దీనికి "శల్యక నాట్య" మను నామమబ్బెను. ఆ శబ్ద మీ దిగువను వ్రాయబడుచున్నది.

### శబ్దము

ఝుహాం తజ్ఝగణం + ఝుం తజ్ఝణాం + జగణాం తగణాం తక, ఝుంత జగణాం + తగణం + తాం తజగణాం + తోం తధిగిణాం + ణాంతకిణ ఝుంతజగణ తాం తతగణ తోం తనధిగిణాత ఝుంతజగణ- తోంతతగణ-తోంతదధిగిణాత-ఝుంతజగణ-తోంతతగణ-తోంతదధిగిణాత ధణాంతరితకిట—తారి తరికిట ధణకు ఝుం + కిణాకు ఝుం + ణాగఝుంతా + తహిధ త్తత్తా కితతకధణా ధణతఝుణు + ధరికితతక + ధరికితతక— ధణాధణాత ఝుణు + ధరికితతక + ధరికిడతక - తత్తళాంగుతక తోంతక తళాంగు తొంతకదధిగిణతొం తత్తళాంగు తోం, తకతళాంగుతొం తకదధిగిణతొం తత్తళాంగు తొంతకతళాంగుతొం తగధధిగిడితొం॥

### శశక నాట్య శబ్ద విధిః

కదాచి న్నైమిశారణ్యే యోగివాని నిషేవితే
కారండ బక కోకాది పక్షికోలాహలాన్వితే॥ 1

సర స్తీరే సమాసీనః ధ్యాయ న్నాత్మాన మాత్మని
దదర్శ శశకం కంచిత్ విశ్వరూపధరో హరః॥ 2

ఉత్ప్లుత్యోత్ప్లుత్య గచ్ఛంతం తథాగచ్ఛంత మేవహి
తచ్చిత్రగమానాత్యంత బద్ధదృష్టి రుమాపతిః॥ 3

ఆహిరీ రాగమాలప్య ఆదితాళానుగం యథా
ధీన్నాగధీతి శబ్దంచ కల్పయన్ బహుధాకరోత్ ॥ 4

యన్నాట్యంతు సరస్తీరే భువి తచ్ఛశ నాట్యకం
భువి విఖ్యాత మానీదై్వ నాట్యవేదవిదాం మతే॥ 5

## శశకనాట్య శబ్దవివరము

ఒకప్పుడు సమస్త మునిగణాకీర్ణంబగు నైమిశారణ్యంబున నానావిధపక్షికోలాహలముతో నొప్పు నొక సరోవర తీరమున నీశ్వరుండు ధ్యాననిమగ్నుండై కళ్లు తెఱచి చిత్రవిచిత్రముగా కుప్పి గంతులు వైచుచు నెగురుచున్న చెవులపిల్లిని చూచెను. వెంటనే దాని గమనము ననుసరించి యీశానుడు ఆహిరీరాగముతో నాది తాళములో "ధీంన్నాగధీ" అను శబ్దముతో మహానాట్య మొనరించెను. అందుచే దీనికి శశకనాట్యమను పేరు వచ్చెను ఆ శబ్ద మీ క్రింద నీయబడినది.

## శబ్దము

ధీన్నాగధి-ధీన్నాగధి ధిమితక్కిడ తరితాం + తకాకి-ధిమిత ధిమితధిమి, తధిమికిడతక- 2 సార్లు.

తద్ధిమితకతోం + తకధిమితకతోం + తకధ్రిమి కిడతక తద్దణ, తర్ఝుణు. తద్ధిమి తగ్గధి తద్దరి తక్కిడ తకతః దధిగిణతోం తద్దణ తర్ఝుణు తద్ధిమి తగ్గధి తద్దరి తక్కిడతకః దధిగిణతోం తద్దణ తర్ఝుణు తద్ధిమి తగ్గధి తద్దరి తక్కిడతకతః దధిగిణతోం.

తాధిదత్తధణతా + ధణతాధి తత్తఝుణుతా + ఝుణుతాధి తత్తధణతా + దణతాధితత్తఝుణుతా తధిత్తధిమితా + ధిమితాధితత్త గధితా + గధితాధి తత్తధరితా + ధరితాధితత్త-ధణతాత్త; ఝుణు

తాధి తత్త, ధిమితాధితత్త, గధితా త్త-ధరితాధితత్త-ధణతా + ఝణుధా + ధిమిధా + గధిధా + ధరితా + దణతా + ఝణుధా + ధిమిధా గధిథా దరిధా ధణతకధా + ఝణుతకధా + ధిమితకధా + గధితకధా + ధరితకధా + ధణతకధ + ఝణుతకధ ధమితకధ గధితకధ ధరితకధ ధణతక ఝణుతక ధిమితక గధితం ధరితక తత్తధణ తఝణు తధిమతగధితక తదధిగిణత దధిగిణత దధిగిణత.

## చిక్రోడ నాట్యశబ్దవిధిః

కైలాస శిఖరే రమ్యే నానామణివిరాజితే
పత్రపుష్పఫలాకీర్ణః సుదూరారోహ ఏవచ 1

శాఖాభిశ్చ విశాలాభిః ఆవృత్య ప్రదిశో దిశః
కూజత్పక్షినికాయైశ్చ కులాయై రుపశోభితః 2

ఉరుస్కంధః కశ్చి దాసీత్ వృక్ష స్తత్ర వటాభిధః
తన్మూలే విచరన్ కశ్చిత్ చిక్రోడః పుచ్ఛ ముచ్ఛలన్ 3

మూలా దగ్రం తథై వాగ్రా న్మూల మేవ ముహుర్ముహుః
నిమేషేణై వ కాలేన విచిత్ర గమనాదికమ్ 4

కుర్వన్ విక్రీడయామాస మధ్యే మధ్యే విలంబనం
తద్దృష్ట్వా విస్మిత శ్శంభుః అకరో న్నాట్య మద్భుతమ్ 5

తచ్చిక్రోడస్య గమన మనుకుర్వన్ మహావటః
తఝ్ఝుంఝుంతేతి శబ్దంచ ఆదితాళ సమన్వితమ్ 6

ద్వితీయం కాల మాశ్రిత్య తాళాంగం స్ఫుట ముచ్చరన్
చిక్రోడాఖ్యం నాట్య మేత ల్లోకే విశ్రుతి మాదధౌ. 7

## చిక్రోడనాట్య విధి వివరణము

నిఖిలమణి విరాజితంబైన కైలాస శిఖరంబున పత్రపుష్ప ఫల శోభితంబై, ఆరోహించుట కలవికానిదై, సుదీర్ఘమైన శాఖలతో

దిక్కుల నాక్రమించి నిఖిల పక్షికూజితములతోను, గూండ్లతోను నిండి యతివిశాలమైన కాండముతో నొక మఱ్ఱిచెట్టు గలదు. ఆ చెట్టుపై నొక యుడుత మొదటి నుండి చివరకు చివరినుండి మొదటికిని తోకనెత్తి యాడించుచు, ననేక గమనరీతులతోఁ దిరుగుచుండెను. ఆయుడుత గమనమును జూచి యాశ్చర్యము చెంది పరమేశ్వరుడు ఉడుత గమనానుసారముగ మహాద్భుతమగు నృత్యమును ఆదితాళ ములో రెండవకాలమున "తఝ్ఝుంఝుంత" యను శబ్దముతో చేసెను. అందుచే దీనికి చిక్రోడనాట్యమను నామ మబ్బెను.

## శబ్దము

తఝుంఝుం తధిక్కిణం తాధిగితాతా + ఝుంఝుంత ధిక్కిణంతా ధిగితాతా + ఝుంతధిక్కిణం తాధిగితాతా + తధిక్కిణం తాధిగితాతా + ధిక్కిణంతాధిగితాతా + కిణంతాధిగితాతా + ణం తాధిగితాతా + తాధిగితాతా + తాధిగితాతా + తాధిగితాతా + ధిగితాతా + ధిగి తాతా + తా + తా + తా

తారిడకతఝుం + తక్కిడతకతఝుం + తక్కిడతక + ధిక్కిడత

## మండూక నాట్య శబ్దవిధిః

కదాచి న్నహుపారణ్యే నానావృక్ష సమన్వితే
నానామృగ సమాకీర్ణే పక్షిభిర్బహుభిర్యుతే 1

కాత్యాయనీ సమాయుక్తో మహాకాలో మహానటః
విచిత్ర విషయాన్ దృష్ట్వా సంపూర్ణానందమానసః 2

తత్త్రరమ్యప్రదేశేషు విహరన్నిర్మలాంభసా
పద్మపత్రలతాపుష్పైః సంక్షోభిత సరోవరమ్ 3

విలోక్యానంద మప్రాప్య మవాప పరమేశ్వరః
భాషయన్ సృష్టివైచిత్ర్యం బహుధా పరమాద్భుతమ్ 4

అత్రాంతరే సరస్తీర మాసాద్య ఘనదర్దురాః
ఉల్లంఘయంత స్తిష్ఠంతో నదంతశ్చ పృథక్పృథక్ 5
చిత్రాతిచిత్రగమనై రుక్తాః దృష్ట్వా శివేన తే
తతః పరమసంతుష్ట స్తన్నాదం లంఘనం స్మరన్ 6
తద్వదేవ మహానాట్య మకరో త్పార్వతీపతిః
స్వపత్నీచిత్తసంతుష్ట్యై శర్వస్సరం విదాంవరః 7
మిశ్రజాతౌ చాపుతాళే రేగుప్తీరాగసంయుతం
తాంతరితేతి శబ్దేన కుర్వన్ విస్మయ కల్పనామ్ 8
యన్నాట్య మకరో ద్దేవదేవ స్తత్ర మహాద్భుతం
తదేవ లోకే మండూకనాట్య మిత్యభిధీయతే 9

## మండూకనాట్య వివరణము

పూర్వ మొకప్పుడు సమస్త మృగపక్షి జంతుసంతతులతోను, చిత్రవిచిత్రలతా వృక్షములతోను సమాకీర్ణమయిన నహుషారణ్యమున పార్వతీసమేతుండై పశుపతి విచిత్ర విషయముల జూచి యానందించి యాయా రమ్యప్రదేశముల విహరించుచు నొకచోట పద్మములతోను, నిర్మలజలములతోను నిండియున్న యొక సరోవరమునుగాంచి దానిని గూర్చి సృష్టివైచిత్ర్యమును పార్వతితో నుగ్గడించుచుండ నంతలో ఆ సరోవరపు టొడ్డునకు గెంతుచు, నాగుచు, నఱచుచు బహువిధములగు కప్పలు సంతోషమనుభవించుచుండెను. అంతపరమేశ్వరుడామండూకముల గంతులను అఱుపులను గని విని వాని ననుసరించి చిత్రవిచిత్ర గమనములతో "తాంతరిత" యను శబ్ద కల్పనతో మిశ్రజాతి చాపుతాళమున రేగుప్తి రాగముతో పార్వతి నానందపఱచుటకై మహానాట్య మొనర్చెను. మండూకనాట్య ధ్వనుల ననుసరించి నాట్యమొనర్చెను గాన దీనికి మండూకనాట్య మను పేరు వచ్చెను. ఆ శబ్ద మీక్రింద లిఖింపబడుచున్నది.

## శబ్దము

తక్కిణంకిణ, తరితఝుంతరి, తాగఝుణకిట. కుకుంద తధి కుకు, తకుక్కథింకుకు, థింకుతకుక్కకు, ధ ణ త ధ ణ ధ ణ ధి మి త ధి మి ధి మి, తణ్ణణంతరి తాగఝుంతరి, తాగతగణగ, తగణణగణగణగన్, కిడతకతగన్, కిడతకరగన్, కిడతక ధణాధణాధణధణత్ + కిడతకఝుణు తఝుణుఝుణుఝుణుత్ + కిడతకధిమితధిమిధిమిధిమిత్ + కిడతక గధి గధిగధిత్ + కిడతకధణత ధణధణ + ఝుణుత ఝుణు ఝుణు +ధిమత ధిమిధిమి +గధితదధిగధి +ధరితధరిధరి-కిడతక ఝుణుత ఝుణుఝుణు, ధిమిత ధిమిధిమి గధితగధిగధి, ధరిత ధరిధరి, తద్దణా+ణంకిడతక తద్దరి కిట తక తద్దణా+ణంకిడతక తద్దరికిటతక = ధరికిడతక ధిత్తాం = దధిగిణ తొం + తద్దిణ్ణాగతోం + ధిణ్ణాంగతోం + ధింధింణ్ణాంగతోం + ధిమితధిమిధిమిణాంగతోం + ధిమిణ్ణాగతోం = త త్తధణతక, త త్తఝు ణుతక - త త్తధిమితక - త త్తగధితక - త త్తధరితక - ధిమిత ధిమిధిమి ణాంగాతోం + ధరికిడతక తద్దరికిడతక - తకళాంగు తకదధిగిణతొం + తకతళాంగుతక దధిగిణతొం - తకతళాంగు తకదధిగిణతొం.

## భ్రమరకీటనాట్యశబ్దవిధిః

అథాత స్సంప్రవక్ష్యామి నాట్యం భ్రమరకీటకం
భ్రమరః కీటకం బధ్వా వృక్షరంధ్రే నివేశ్యచ 1

ఓంకారనాదం కృత్వాచ వలయాకారవర్తనం
తన్నాదం పరితః శ్రుత్వా కీటకో భయవిహ్వలః 2

నాదానురూపో నాట్యేన కీటకో భ్రమరోఽభవత్
పరిణామ మిదం సర్వం శంకరేణావలోకితమ్ 3

విధాతు స్సృష్టివైచిత్ర్యదృష్ట్వా చకితమానసః
నాదం శ్రీరాగవర్ణేన వర్తనం చాటతాళకం 4

ఝేంతారీతి శబ్దేన చతుష్కాలాన్వితాని వై
శబ్దజాలాని సర్వాణి వాద్యత్రిక విధానతః 5
నాట్య మేతత్కుమారాభ్యాం శంకరోపదిదేశ హ
శివోపదిష్టమేతచ్చ యః కుర్యా ద్దేవతాలయే 6

శృణుయాద్వాపి భక్త్యాతు గిరిశే కమలాననే
సర్వాన్ భోగాంశ్చ భుక్త్వైవ అంతే సాయు జ్య
మాప్నుయాత్. 7

## భ్రమరకీటనాట్య శబ్ద వివరణము

పూర్వమొకప్పుడు పార్వతీపరమేశ్వరులు కైలాసపర్వత ప్రాంతమున విహరించుచుండగా నొకతావున నొక భ్రమరంబు (తుమ్మెద) ఒక కీటకమును బట్టుకొని యొక వృక్ష రంధ్రమున నిడి ఓంకార మిళితంబగు ఝుంకార నినదముతో నా కీటకము చుట్టును తిరుగు చుండెను. ఆ నాదమునే వినుచు ఆ కీటకంబు తన్నాదమును భయముచే మననము చేసికొనుచు కీటక జన్మను విడిచి భ్రమరమయ్యెను. ఈ మార్పును చతుర్ముఖుని సృష్టి వైచిత్ర్యమును పరమశివుడు చూచి యా భ్రమరనాదమును, వలయాకారముగా తిరుగుటను, ననుసరించి శ్రీరాగముతో నాదితాళమున నాల్గవ కాలములో "ఝేంతారి" అను శబ్దకల్పనతో మహానాట్య మద్భుతముగా నొనర్చెను. పిదప కుమారులగు వినాయక షణ్ముఖుల కానాట్య ముపదేశించి పార్వతితో ఎవరీ నాట్యమును శివాలయమున చేయుదురో, వినెదరో వారు సకల భోగముల ననుభవించి నా సాయుజ్యమందగలరు. భ్రమర కీట నాట్యము ననుసరించి చేయుటచే దీనికి భ్రమరకీట నాట్యమను పేరువచ్చెను. ఆ శబ్దము వ్రాయబడుచున్నది.

## శబ్దము

ఝేంపప-పపపప - పపపప - పమ్-తారీ = + ధాఅఆ ఆమ్ ధా + ణా—తధీఈఇమ్ + ధిమితా అ- + తకుందారీ—దణా + కిణా + ఝేంణూత = ఝేంపపప ఝేంణూత = + ఝేంప = పై కాలపు జాగాలకు ముక్తాయీలు = కిడతక తళాంగుతక దధిగిణతోం + కిడత తళాంగుతక దధిగిణతోం × కిడతక తళాంగుతక దధిగిణతోం = తారీ = + తళాంగుతక దధిగిణతోం + తళాంగుతక దధిగిణతోం = ధీఈఇమ్ = తకదధిగిణతోం + తకదధిగిణతోం + తకదధిగిణతోం + తకుందారి + హి = దధిగిణతోం + దధిగిణతోం + దధిగిణతోం + దధిగిణతోం = ఝేంణూత = ఝేం = పై కాలము 6 వకాలము శబ్దకాలము = ఝుణుత = ఝేంపపప.

### తిత్తిరిపక్షినాట్య శబ్ద విధిః

పురాతు దారుకారణ్యే నానావృక్షలతాన్వితే
మత్తేభ సింహ శార్దూల భల్లూక మృగ సంయుతే 1

వసంతకాలే సంప్రాప్తే పుష్పపల్లవ శోభితే
శుక పికాదిఖగానాంతు మధురస్వర రాజితే 2

హైమవత్యా సహ శ్రీమాన్ భగవాన్ చంద్రశేఖరః
తద్వనే విచరన్ సర్వవిశేషాంశ్చ విలోకయన్ 3

తద్విశేషకథాః పత్న్యై కథయన్ ముదమాప సః
ఏతస్మిన్నంతరే కేచిత్కుక్కుటా స్తత్రపక్షిణః 4

వేదమంత్ర ఘనప్రోక్త రీత్యా మోదసమన్వితాః
ఉదాత్తా ననుదాత్తైశ్చ స్వరితై స్స్వరై వస్స్వరై స్సహ 5

కూజంతో విచరంతశ్చ మహానంద రమథాయయుః
తత్తిత్తిరిరుతం శ్రుత్వా శివ స్తత్కూజితానుగమ్ 6

ఆనందాతిశయే నాసౌ భూతేశోఽభూతపూర్వకం
స్వప్రియా పార్వతీ ప్రీత్యై మహానాట్య మనుత్తమమ్ 7

సంకీర్ణ-జాతి త్రిపుటే సామరాగ సమన్వితమ్
తఝుంతకేతి శబ్దంచ కల్పయన్ సుమనోహరమ్ 8

యన్నాట్య మకరోత్తత్ర భవానీపతి రద్భుతం
తత్తిత్తిరిమహానాట్య మితి లోకే హి విశ్రుతమ్ 9

## తిత్తిరి నాట్యశబ్ద విధివివరణము

పూర్వకాలమున నానాతరులతా శోభితంబును, సింహగజ శార్దూలాదిజంతు సంయుతంబును నగు దారుకారణ్యము వసంత ఋతుసమయమున చిలుకలు కోకిలలు మున్నగు పక్షుల కూతలతోను చిగిర్చి పుష్పించిన తరులతా సమూహములతోను నిండియుండగా భగవంతుడగు చంద్రశేఖరుడు పార్వతీసమేతుడై యావనమున సంచరించుచు వివిధ విశేషముల నరయుచు ఆ విషయములకు సంబంధించిన కథలను పార్వతికి చెప్పుచు సంతోషముగానుండెను. ఇంలో కొన్ని తిత్తిరి పక్షులు సంతోషముతో వేదమందలి మంత్రములకు ఘన చెప్పినరీతిగా ఉదాత్తానుదాత్తస్వరిత స్వరములతో కూయుచు, నెగురుచు, దిరుగుచు సంతోషమును బొందుచుండెను. ఆ తిత్తిరి పక్షుల ధ్వనులను విని ఆనందాతిశయముచే భూతేశుడగు నీశ్వరుడు అభూత పూర్వకముగా నాపక్షుల కూతల ననుసరించి పార్వతిని సంతోషపెట్టుటకై యద్భుతమైన నాట్యమును సామరాగముతో సంకీర్ణ జాతి త్రిపుటతాళములో "తఝుంతక" యను శబ్దమును చట్టుచు మిక్కిలి ఘనముగా నొనర్చెను. తిత్తిరి పక్షుల కూతల ననుసరించి చేయబడిన నాట్యముగాన దీనికి తిత్తిరినాట్యమను ప్రతీతి లోకమునం గల్గెను. "తఝుంతక" అను శబ్ద మిక్రింద వ్రాయబడుచున్నది.

## శబ్దము

వేదమంత్రములకు జట, ఘన, యని రెండు గొప్ప విషయములు గలవు. అందు ఘన యనునది ఈశ్వరభక్తుడగు రావణునిచే కల్పింపబడినదని ప్రతీతి. ఆ వేదమంత్రమందలి మూడేసి పదములు పునరావృత్తములగుచు మొత్తము 13 సార్లు సస్వరముగా పలుకబడును. దీనినే ఘన యందురు. అటులనే సంకీర్ణ జాతి త్రిపుట తాళమునకు 13 క్రియలు గలవు గాన నారీతిగా నీశ్వరుడీ శబ్దము కల్పించెను. అందుచేతనే వేదమందలి యొక యుపనిషత్తునకు తైత్తిరీయోపనిషత్తని పేరున్నది.

తఝం తకఝం తకఝం తఝం తఝం తకఝం
తరిఝం తరిఝం తఝం తకఝం తకఝం తఝం తరిఝం 1

తరిఝం తఝం తఝం తరిఝం తరిఝం తఝం తకఝం
తకఝం తఝం తరిఝం తఝం తకఝం 2

తకఝంధణఝం ధణఝం తకఝం తకఝం ధణఝం త్రిమితః
త్రిమితః ధణఝం తకఝం తకఝం ధణఝం త్రిమితః 3

త్రిమితః తద్ధణ తద్ధణ త్రిమిత త్రిమితః తద్ధణ తఝణు
తఝణు తద్ధణ త్రిమిత త్రిమితః తద్ధణ తఝణు 4

తఝణు తద్దిమి తద్దిమి తఝణు తఝణు తద్దిమి తగ్గధి
తగ్గధి తద్దిమి తఝణు తఝణు తద్దిమి తగ్గధి 5

తగ్గధి తద్దరి తద్దరి తగ్గధి తగ్గధి తద్దరి కిడతకతత్ కిడతక
తత్ తద్దరి తగ్గధి తగ్గధి తద్దరి కిడతకతత్ 6

కిడతకతత్ తద్దరి తద్దరి కిడతకతత్ కిడతకతత్ తద్దరి ధణతకతత్
ధణతకతత్ తద్దరి కిడతకతత్ కిడతకతత్ తద్దరి
ధణతకతత్ 7

ధణతకతత్ కిడతక కిడతక ధణతకతత్ ధణతకతత్ కిడతక
తళాంగు తళాంగు కిడతక ధణతకతత్ ధణతకతత్ కిడతక
తళాంగు 8

తళాంగు తకదధి తకదది తళాంగు తళాంగుతక దధిగిణతోం
గిణతోం తళాంగు తకదధి తకధి గిణతోం తళాంగు 9

మహోదధినాట్యశబ్దవిధిః

కదాచి త్పూర్వకాలేతు పార్వతీ సహితో మృడః
సముద్రతీర మాసాద్య తద్వేలాయాం చర న్ముదా 1

పాతాళలోక మారభ్య నాకపర్యంత మున్నతం
గంభీరముద్రయా యుక్తం రంగత్తుంగ తరంగకమ్ 2

నీలనీరదసరికాశం హృదయానందదాయకం
తిమింగిలగిలోపేతం మత్స్యాది మకరాలయం 3

వజ్రవైడూర్య ముక్తాది రత్నానామాకరం తథా
మేఘనిర్ఘోషసంకాశ భయదధ్వనసంయుతం 4

అయిప్రాణప్రియేదేవి ! విలోకయ మహోదధిం
ఇత్యుక్త్వా శైలసంకాశ వీచీనా మాగతిం గతిమ్ 5

దృష్ట్వా మహేశ్వర స్తత్ర పరమానంద తుందిలః
తత్సముద్ర తరంగానుసారం నాట్య మథాకరోత్ 6

గిరిజాసంతోషణార్థాయ రాగం జంఝోటి నామకం
ఆదితాళే తాళశబ్దం తాంతరి ధణేతి కల్పయన్ 7

యన్నాట్య మభరో దీశో మహానందాత్తచేతనా
తన్మహోదధితరంగాఖ్య నాట్య మిత్యభిధీయతే 8

## మహోదధినాట్య శబ్దోత్పత్తి వివరణము

పూర్వకాలమం దొకానొకప్పుడు పార్వతీసమేతుడయి పరమేశ్వరుడు సముద్రతీరమునకేగి యాచెలియలిగట్టుపై సంతోషముగా దిరుగుచు పాతాళలోకమునుండి స్వర్గలోక పర్యంతము ఔన్నత్యముతో నున్నదియు, మహాగంభీరమై తరంగములతో నిండియున్నదియు, వజ్రవైడూర్యాది రత్నముల కాలవాలమైనదియు, నల్లని మేఘములతో సమానమై మహానందమును చేకూర్చునదియు, మత్స్యములు, మకరములు తిమింగిలములు మున్నగు జలజంతువులతో నిండియున్నదియు, మేఘము ఉరుమురీతిని ఘోషించునదియు, నగు నీ మహోదధిని చూచితివా పార్వతీ! యని పల్కి పర్వతోమానములగు తరంగముల గమనాగమనములను చూచి పరమేశ్వరు డానందాతిశయముచే నా సముద్ర తరంగముల ననుసరించి పార్వతీదేవి సంతోషమునకై జంఘూటిరాగములో ఆదితాళములో "తాం తరిధణత" యను శబ్దముతో మహానాట్య మొనర్చెను. సముద్రతీరమున నీశ్వరు డేనాట్యమొనరించెనో అయ్యది మహోదధి నాట్యమనబడి లోకమున ప్రసిద్ధినందినది. ఆ శబ్ద మీ దిగువ వ్రాయబడినది.

### శబ్దము

తాంత + రిధణతకిణం తరితఝ్ఝుంత + గధిణతరిఝుంత ధిమితోంత + తటధిణతరిధిన తరికూంత + తరితకతధింకుతక + తద్ద ణా + ధణతఝుణు + ఝుణుతధిమీ + ధిమితగధీ + గధితధరీ + తధణత తాంత + రిధణతఝ్ఝుంత + గధిణతతోంత + రిధణంత + రిధణత + తాంతరిత + ఝుంతకిట + తోం తధిమి + ణంతగధి + కూంతధరి + తరితదాం + ధణతధీమ్ + ధిమితఝ్ఝుం + తతగణా + తతఝుణు + తతధిమీ + తతగధీం + తధణత-రితఝుణు గధిధిమి, తకుందరి "కిడతక దధిగిణత + తకదధిగిణత దధిగిణత"

తఝుం + తక ఝుం + తకుందరితఝుం + ఝుం ఝుణుధణ తధిమి ధరిగిడతక ధి త్తళాంగుతక దధిగిణతొం ధరికిడతక ధి త్తళాంగు తకధధిగిణతొం ధరికిడతక ధి త్తళాంగుతక దధగిణతొం.

తాం + ధణాం + దణాంతకఝుం + కిణాం + కిణాంతరి తాం తకిడతక, తకుందరి తకిట, తఝుణుతధిమిత, గధింధణత దధిగిణతొం గధింధణత దధిగిణతొం గధిందణత దధగిణతొం.

తద్ధీ + ధరికిటజగణంతరి + తరితకిణఝుణు తదిద్దిణాం ధిగి ధిగిఝుం తరికుంద + కుంద తకుందకిడ తకఝుం ధరుగుడుతొం తొంకిడ తకతాహాంగ త్త ళాంగు, తిక్కిణాంగు ధిక్కుడు కిడతక తాంః కిడతక తద్దిమి తద్దిమి తద్దిమి తకుందరికిడతక ధింకుత ధింక్కుఝుం తకురొంత కిడతక తాంతకిడతక తక తకదధి గిణతొంధింకు తక్కుఝుంత రొంత కిడతక, తాంతకిడతక తకదధిగిణతొం ధింకు తక్కుఝుంత రొంత కిడ తక, తాంతకిడతక తకధిగిణతొం.

కిణతఝుం + ధణతఝుం + ఝుణుత ఝుం + ధణం + తతొం + తరింధతణత॥ తకిటధికిట॥ ధిమిత + ఝుణుత।తరితకుంత। తగణంతరి। ఝుంతరికిడతక + దిద్ది త్తళాంగుతక, తళాంగు తళాంగుతక, తళాంగు తకదధిగిణతొం॥ దిద్ది త్తళాంగు తక తళాంగు తళాంగుతక తళాంగుతక దధిగిణతొం॥ దిద్ది త్త ళాంగుతక తళాంగు తళాంగుతక, తళాంగుతక దధిగిణతొం॥

కిణ్ణంగతతొం + తకధిణ్ణంగతతొం + కిణాం + ధణాం + ఝుణుతతొం తధిన + తొం తధిన + తధినతాఝ్ఝుణు + తధణ తాద్దిమి + తధరి॥ ధిమిఝ్ఝుణుత, ధణం ధిమిత తధింకు॥ కిడతక్కిణాంగు తక దధిగిణతొం॥ ధిమిఝ్ఝుణుత, ధణం ధిమిత॥ తధింకు కిడతక్కిణాంగు తక దధిగిణతొం॥ ధిమి ఝ్ఝుణుత, ధణం ధిమిత, తధింకు, కిడతక్కి ణాంగు తక దధిగిణతొం॥

త_త్తదింకుతక + తధింకుతక + తధిం ధింకుతక + ధింకు తక + తఝుంత + రికుంత + । రిదాంధణఝ్ఝోం,ధణతాం తకిడతక, గధిం ధిమిత కిట। తఝ్ఝుణు + తద్దిమి + తగ్గధి + తద్దరి + ధరికిడతక ఝుంతరి దధిగిణ తొం॥ తఝుణు + తద్దిమి + తగ్గధి + తద్దరి + ధరికిడతకఝుంతరి దధిగిణతొం॥ తఝుణు + తద్దిమి తక్కిణ తఝుం + కిణతఝ్ఝుం + తకఝుం + తఝుంతరికు, ధణాకు। కిణాకు॥ తఝ్ఝోకు, ధరేకు. ధణేకు, తళాంగు తహితధీ॥ ధి_త్తతళాంగు తళాంగు కిడతక దధిగిణతొం। ధి_త్తతళాంగు తళాంగు కిడతక దధిగిణతొం॥ ది_త్తతళాంగు తళాంగు కిడతక దధిగిణతొం॥

తకిటధణంధణ, తాహతకుంతక, కుంతగి కుకుందః॥ కిణాకు ఝ్ఝోకుడతక, తఝుణుఝుణుతధరి + ధ్రిమిౙ్రిమి తధణ॥ తఝుణు॥ తధిమి॥ తరికిటతక। కిణకుఝుణు॥ ధరికిడతక, తధింకు॥ తళాంగుతక దధిగిణతొం। ధరికిడతక, తధింకు తళాంగుతక దధిగిణతొం॥ ధరికిడతక తధింకు॥ తళాంగుతక దధిగిణతొం॥

తకిటధ్రిమితక॥ ధిఝ్ఝాగధిం ధణత + ఝాగధిం ధణత + ధణత॥ తాహతః॥ ఝుణుతః। ధిమితః॥ గధితః। ధరిత॥ ధణతకిటతక॥ ధరికిడతక, తధింకుతక, కిణాంగుతక దధిగిణతొం। ధరికిటతక॥ తధింకుతక। కిణాంగుతక దధిగిణతొం। ధరికిటతక॥ తధింకుతక॥ కిణాంగు తక దధిగిణతొం॥ తాంతధణంత + ధణ కిణాంత + కిణఝుణు ధణంత + తకుం దరిత॥ తఝుం తరితక॥ రిఝుం రిధణత। తగధిఝ్ఝోం॥ ధ్రిమి తరితకదాంధణతకిట॥ ధణతధ్రిమిత, కిణతఝుణుత, తకదధిగిణతొం॥ ధణతధ్రిమిత॥ కిణతఝుణుత, తకదధిగిణతొం, ధణతధ్రిమిత। కిణతఝుణుత తకదధిగిణతొం॥

ధిర్ఝ్ఘాగధింధిమిత + ఝాగధింధిమిత + గధింధిమిత + ధింధిమిత॥ ఝుణుతరిటతకుందరి। గధింధిమి॥ దాంధణ॥ తాంత తకిటతక॥ తకిటతోం తకిటతోం॥ తధింకు దధిగిణతోం। తకిటతోం॥ తకిటతోం॥ తధింకు దధిగిణతోం। తకిటతోం తకిట తోం॥ తధింకు దధిగిణతోం॥

తగ్గధిం ధణత ఝ్ఘుం + తగదిం ధణత ఝ్ఘుం + ధణత ఝ్ఘుం + ధణ ఝుణుత॥ రితదాంధణత + తరిత ధింధిమి + తకుందరికుందరిత॥ తర్ఝ్ఘుణు + తధణ + తధిమికిణాంగు తకదధిగిణతోం॥ తఝ్ఘుణు + తధణ + తధిమికిణాంగు తకదధిగిణతోం॥ తర్ఝ్ఘుణు + తధణ + తధిమికిణాంగుతకదధిగిణతోం॥

## కారండవనాట్య శబ్ద విధిః

పురా తు దారుకారణ్యే మహాతరుమనోహరే
సమస్త జంతుసంయుక్తే నానాపక్షిగణైర్యుతే 1
ఆసాయం భార్యయా సార్ధం విహరన్ పరమేశ్వరః
కంచి జ్జలాశయం ప్రాప్య విమలాంభః ప్రపూరకం 2
ఉపవిశ్య సరస్తీరే పత్న్యా సహ మహానటః
అత్రాంతరే సమాగత్య పక్షిః కారండవస్తదా 3
జలాశయే విలోక్యాథ మత్స్య మేకం మనోహరం
ఉత్ప్లుత్యోత్ప్లుత్య పక్షైస్తు నిమగ్నస్తత్క్షణం జలే 4
మీనం ముఖేన సంగృహ్య యథాగత మథావత
తద్విచిత్రం మహాదేవో దృష్ట్వా హృష్టమనాః స్తదా 5
పక్షిణః పక్షవిక్షేప మనుకృత్య మహాద్భుతం
అపర్ణాచిత్తసంతృప్త్యై మహానాట్యం చకార సః 6
చతురస్రజాతి త్రిపుట తాళే తు ద్విత్రికాలగే
తధిత్తాకిట శబ్దేన శంకరాభరణ రాగకమ్ 7

యస్మాన్నాట్య మకరో దీశః తత్ర కారండవం శివః
తస్మాన్నాట్య మభవ ల్లోకే కారండవ మితి స్థిరమ్. 8

## కారండవనాట్య శబ్దవిధి వివరణము

పూర్వకాలమున నిఖిల వృక్షములతోను, జంతు సంతతుల తోను, పక్షిగణములతోను నిండి మనోహరమైన దారుకారణ్యమున పార్వతీసమేతుడై పరమశివుడు సాయంకాలమున విహరించుచు నొక సరస్సును జూచి దాని యొడ్డున సంతోషముగా కూర్చుండెను. అంతలో నొక కారండవము (నీటికాకి) వచ్చి, సరస్సున నొక సోగ సైన చేపను జూచి, రెక్కలల్లార్చుచుఁగొంతవఱకు లక్ష్యముగాఁ జూచి చటాలున నీటిలో మునిగి ముక్కుతో చేపనుబట్టి ఎటనుండి వచ్చెనో యటకేగెను. ఆ యాశ్చర్యమైన పక్షి చేష్ట ననుసరించి యీశ్వరుడు పార్వతిని సంతోషపెట్టుటకై చతురశ్ర జాతి త్రిపుట తాళమున శంకరాభరణ రాగముతో "తధిత్తాకిట" అను శబ్దముతోనే నాట్య మొనర్చెనో అయ్యది కారండవ నాట్యమవి లోకమున స్థిరముగా ప్రసిద్ధినందెను. అందుకతన దీనికి కారండవనాట్యమను పేరుకల్గెను. ఆ శబ్ద మీదిగువ నీయబడినది.

## శబ్దము

తకతకతకతక = తకిటతకిటతక = తకతకతకతక తకిటతకిటతక = తకతకతకతక = తకతకతకతక = తకతకతకతక - తకిట తకిటతక - తకతకతకతక = తకతకతకతక = తకతకతకతక —— తకతకతకతక - తకిటతకిటతక = ధా తకతకతక = తకిటతకిటతక = ధాతకతకతక = తకిటతకిటతక = ధాతకతకతక = ధాతకతకతక = ధాతకతకతక = తకిటతకిటతక = తాకిటతతతకతక - తకిటతకిటతక = కిడతకతకతక తకిటతకిటతక తాకిడ్తకతకతక - తాకిడ్తక తకతక - తాకిడ్తకతకతక

తకిటతకిటతక = తాకి ్డకతక తకిటతకిటతక = కిట్తకత త్తక
తకిటతకిటతక = తాకిట్తక త త్రితాకిట్తక త త్తతకతక - తాకిట్తక
త త్తతాకిట్తక తత త్తతకతకడకిట తకిటతక తకిటతకిటతక.

తధిత్తా కిట్తతక తటతకిటతక = తాకిట్తకతక తకిటతకిటతక =
తధిత్తాకిట్తక తధిత్తాకిడ తకతకకతధిత్తాకిట్తక తధిత్తాకిట్తక తకతక =
తధిత్తాకిట్తక-తధిత్తాకిట్తతకతక-తకిటతకిటతక-తకిటతకిటతక.

తాకిడతక తకతకతకతక ధిగితక = ఝుంతరికిడతక తళాంగు
తక దధిగిణతొం ఝుంతరి కిట్తక తళాంగుతక దధిగిణతొం ఝుంతరి
కిడతక తళాంగుతక దధిగిణతొం కిట్తక తళాంగుతక దధిగిణతొం కిట్తక
తళాంగుతక దధిగిణతొం కిట్తక తళాంగుతక దధిగిణతొం తళాంగు
తక దధిగిణతొం తళాంగుతక దధిగిణతొం తళాంగుతక దధిగిణతొం
తకదధిగిణతొం తకదధిగిణతొం తకదధిగిణతొం దధిగిణతొం దధి
గిణతొం దధిగిణతొం.

ముక్తాయిలు తక్కిన పైనిచెప్పిన వన్నియు మూడేసి సార్లు
ఉచ్చరించవలెను.

ఇయ్యది నందికేశ్వరభరతమున తత్తనాట్యశబ్దోత్పత్తులను ప్రథమా
ధ్యాయము సమాప్తము.

# నందీశ్వరభరతము

## ద్వితీయోధ్యాయః

పురా కైలాస శిఖరే నానారత్న విరాజితే
మందారవనవాటీషు రత్నసింహాసనోపరి 1

సమాసీన ముమా ప్రాహ ప్రాంజలిః పరమేశ్వరం
కదాచి ద్దేవదేవేశం చంద్రశేఖర మవ్యయమ్ 2

అయి ప్రాణప్రియేశాన! నటరాజ మహావిభో!
సర్వశాస్త్రపురాణాని ఇతిహాసాగమా స్తథా 3

యామలాదిని తంత్రాణి ప్రోక్తాని భవతా హి మే
పురా కూర్మావరేతు మోహినీరూప విష్ణునా 4

త్వయాచ స్వరసాహిత్య శబ్దాది సహితం యథా
యద్దర్శితం నాట్యశాస్త్రం నానాపంచముఖీయుతమ్ 5

ఉపదిశ్యతు తద్గుహ్యం సర్వం మహ్యం సనాతన!
తతః ప్రదర్శనం కృత్వా మాం ప్రీణయతు హే ప్రభో! 6

ఇతి తద్వచనం శ్రుత్వా తత్పరాయత్నమాస్థితః
ఉపదిశ్యతు తత్పూర్వం పార్వత్యై పరమేశ్వరః 7

తత్రప్రదర్శనకామ స్సన్ శివస్తు బహి రేకదా
బ్రహ్మాణం విష్ణు మింద్రాదీన్ దేవతాశ్చ తథాఖిలాః. 8

తుంబురాదీంశ్చ గంధర్వాన్ రంభాద్యప్సరస స్తథా
నారదాదీంశ్చ దేవర్షీన్ వశిష్ఠాది మునీం స్తథా 9

సర్వా నాహూయ స ముదా నాట్యరంగ మకల్పయత్
తత్ర సర్వే సమాహృత్య స్వస్వాసన ముపావిశన్ 10

కంచిత్కాలం వినోదాయ కాలకాలో మహానటః
దర్శయిత్వా తత్సమక్షం నృత్యగీతా ద్యనేకథా 11

తతః పశ్యత్సు దేవేషు హ్యేకాగ్రమతిషు ప్రభుః
అనన్యదుర్లభే పంచముఖీ తాళప్రదర్శనైః 12

నందిభృంగీశ్వరౌ చైవ చండీశో నారద స్తథా
తుంబురు శ్చేతి విఖ్యాతాన్ భరతే పంచ గాయకాన్ 13

పరీక్షకా న్నియమ్యైతా నేకాగ్రమనసః క్రమాత్
సంగీతస్వరసాహిత్యశబ్దశాస్త్రవిశారదాన్ 14

సవ్యదక్షిణపాదాభ్యాం త్ర్యస్ర సంకీర్ణ నామకే
వామదక్షిణపాదాభ్యాం మిశ్రాఖ్య చతురస్రకే 15

బాహుమూల ।సఘాతేన ఖండజాతిం యథాక్రమమ్
పంచస్వంగేషు సంగృహ్య పంచజాతీః ప్రదర్శయన్ 16

ఏకదోపక్రమ శ్చోపసంహార శ్చైకదైవ హి
ఘాతే ఘాతే తు కాలోసౌ లఘురూపో యథా భవేత్ 17

తథాతినియతం కృత్వా స్వరసాహిత్యశబ్దకాన్
తాళశబ్దాన్ బహూన్ కుర్వన్ జనయామాస తన్ముదమ్ 18

తదాసనాద్వినిష్క్రమనా విష్ణుః పార్వతిశాసనాత్
స్వయం మోహినిరూపేణ మోహయన్ మారమారకమ్ 19

యాం ప్రదర్శితవాన్ పూర్వం చిత్రాం పంచముఖీం హరిః
ఆరోహణావరోహాదిక్రమశ స్తామదర్శయత్ 20

తత శ్చతుర్ముఖో బ్రహ్మ విస్మయం పరమం గతః
ఆనందవశగో భూత్వా ప్రదర్శనపరోఽభవత్ 21

ఆరోహాదిక్రమేణైవ కాలాః పంచ చ జాతయః
ప్రథమాద్యా స్తథా త్ర్యస్రముఖా వామపదే క్రమాత్ 22

దక్షపాదే దక్షహస్తే వామహస్తే తథైవచ
కక్షోభయసమాఘాతే అన్యూనానతిగా యథా 23

భవేయు స్తా స్తథా కృత్వా దర్శయామాస వై విధిః
యథాపూర్వం పంచముఖీం విష్ణుః ప్రాదర్శయ త్తథా 24

కించ వామేన పాదేన త్ర్యస్రగం తాళ సప్తకం
దక్షపాదేన సంకీర్ణ జాతిగం తాళసప్తకం 25

చతురస్రయుతం తాళసప్తకం దక్షిణేన తు
తాళానాం సప్తకం మిశ్రగతం వామకరేణ హి 26

కక్షఘాతేన తాళానాం సప్తకం ఖండగం తథా
చంచత్పుటాది తాళాంశ్చ పృథగేకోత్తరం శతం 27

ఉభాభ్యామేవ హస్తాభ్యాం అస్తవ్యస్తం ప్రదర్శయన్
సర్వాన్ సభాసదో భ్రాంతాన్ ఆనందమయమానసాన్ 28

యదాకరోత్తదా తత్ర పార్వతీపరమేశ్వరౌ
ఉమామానసహితౌ ప్రీత్యా బ్రహ్మాణం తు చతుర్ముఖమ్ 29

గంధతాంబూలమాల్యాద్యై రంబరాభరణాదిభిః
కృత్వా తు సత్కృతిం తస్మై లయబ్రహ్మేతి వాదినౌ 30

స్తువంతౌ బహుధా వాగ్భి రభితో భినన్దతుః
తదేత త్సర్వ మాలక్ష్య పరమానంద తుందిలః 31
మారుతీ రౌద్రరూపేణ దిగంతానపి భేదయన్
కులాద్రీన్ కంపయన్ కోపాత్ ఘూర్ణయన్ సప్తసాగరాన్ 32
సుదీర్ఘం ప్రణవం కృత్వా విధాయాజాదివందనం
ప్రసిద్ధే చాదితాళేహి చతురస్రత్రిపుటాభిదే 33
ప్రథమాద్యాస్తు షట్కాలాః దృశ్యాంతేచ యథాక్రమం
సవ్యదక్షిణపద్ధస్తకరా స్వాంగేషు పట్సు వై 34
అనేకాక్షరవిశ్రామ విశేషేణ విరాజితాః
స్వరసాహిత్యశబ్దాంశ్చ రాగభేదాన్ ప్రకీర్తయన్ 35
షట్కాలషణ్ముఖీ త్యాఖ్యాం చిత్రాం తాళగతింవ్యధాత్
తతో వాతాత్మజం ధీరం పార్వతీ పరమేశ్వరౌ 36
లక్ష్మీనారాయణౌ చైవ వాద్యఘోషపురస్సరమ్
రత్నమాల్యాద్యలంకారై రలంకృత్య ముదాన్వితౌ 37
బ్రహ్మపర స్త్వం భవేతి వరం దత్వా తతః పరం
షట్కాలభరతాచార్య స్త్వయేవాసి న సంశయః 38
ఇత్యేవ మూచతు ర్దేవౌ పార్వతీపరమేశ్వరౌ
రంభాద్యప్సరసాం నాట్యైః తతో మంగళగీతిభిః 39
మంగళాశాసనై శ్చాపి జయశబ్దై స్తథైవచ
ఆనందవచనై స్సర్వై స్సానభాహి సమాపితాం. 40

## పంచముఖితాళప్రదర్శనవిధి వివరణము

పూర్వము నానారత్న విరాజితంబగు కైలాస శిఖరంబున మందారవనాంతరమున సింహాసనాసీనుండగు నీశ్వరునిగూర్చి పార్వతి

ప్రశ్నించుచున్నది. ప్రాణప్రియ! నిఖిల శాస్త్ర పురాణములు, నితిహాసములును, యామళాది తంత్రములు నాకుపదేశించితివి. కాని కూర్మావతార సమయమున మోహినీరూపధారియగు మహావిష్ణువును, మీరును స్వరసాహిత్య శబ్దకల్పనలతో నేయేపంచముఖులను ప్రదర్శించిరో యా యా వివిధ పంచముఖులను ప్రదర్శించి సంతసమును కలిగింపు' డని పార్వతి కోరగా నీశ్వరుడా పార్వతి కోర్కెను దీర్చుటకు ప్రయత్నించి బ్రహ్మవిష్ణుమహేంద్రాది దేవతలను, తుంబురాది గంధర్వులను, రంభాద్యప్సరసలను, నారద వశిష్ఠాది మహామునులను పిలిచి నాట్యరంగమును కల్పించి యెవరి యాసనముల వారందరు ఉపవిష్టులై యుండగా మహానటుండగు మృత్యుంజయుండు వివిధ నాట్యములొనరించి పిమ్మట అనన్య దుర్లభంబగు పంచముఖి తాళప్రదర్శనమొనర్ప సభాసదు లేకాగ్రమానసులై చూచుచుండిరి. పంచముఖి ప్రదర్శనమును మహాగాయకులగు నందీశ్వర, భృంగీశ్వర, చండీశ్వర, నారద, తుంబురు లేవురును జాగరూకతతోఁ జూచుచుండిరి. అంత నీశ్వరుడు వామపాదమున త్ర్యస్రజాతిని, దక్షిణపాదమున సంకీర్ణ జాతిని, వామహస్తమున మిశ్రజాతిని, దక్షిణహస్తమున చతురస్రజాతిని, కక్షద్వయముతో ఖండజాతిని క్రమముదప్పక స్వర సాహిత్య శబ్దకల్పనల జతకూర్చి కొన్ని యావృత్తములతో ప్రారంభోప సంహారము లొనర్చెను. సభాసదు లందఱును బ్రహ్మానందమందిరి. తరువాత పార్వతి చెప్పగా మహావిష్ణువు ఆసనమునుండి లేచి మోహినీరూపముతో మారసంహారకుండగు నీశ్వరుని ఏ విచిత్ర పంచముఖితో మోహింపజేసెనో ఆ పంచముఖిని ఆరోహణావరోహణ క్రమము దప్పక ప్రదర్శించెను. అంతట చతుర్ముఖుండగు బ్రహ్మ పరమాశ్చర్యమునొంది ఆనందాతిశయముతో తన పంచముఖిని ప్రదర్శించుట కుద్యుక్తుడై అరోహాదిక్రమముతో ఒకటి రెండు మూడు నాలుగైదు కాలములలో త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర,

సంకీర్ణ జాతులను సక్రమముగా వామదక్షిణపాదంబులతోను, కుడి యెడమచేతులతోను, కక్షద్వయముతోను, హెచ్చుతగ్గులు లేకుండ విష్ణు వెట్లు పంచముఖి ప్రదర్శన మొనర్చెనో యట్లే ప్రదర్శన మొనర్చెను. ఇయ్యది కష్టతరమైనది. మఱియు వామపాదమున త్ర్యస్రజాతిలో సప్తతాళములను, కుడిపాదమున సప్తతాళములలో సంకీర్ణజాతిని, కుడిచేతితో సప్తతాళములలో చతురస్రజాతిని, ఎడమచేతితో సప్త తాళములలో ఖండజాతిని, మఱియు చంచత్పుటాది నూటయొక్క తాళములను వామదక్షిణ హస్తములలో నేచేతితో నే తాళము కావలె నన్న నాచేతితో నాయాతాళములనువేసి ప్రదర్శించుచు సభాసదుల నందరిని ఆశ్చర్యనిమగ్నులుగా జేసి సంతోషపెట్టెను. అంతట పర మేశ్వర మహావిష్ణువులు, పార్వతీలక్ష్ములతోకూడ బ్రహ్మానందము నొంది, చందన తాంబూలమాల్యాంబరాభరణాదులతో బ్రహ్మదేవు నర్చించి యీ చతుర్ముఖుఁడు లయబ్రహ్మ యని బహువిధములఁ బొగడిరి. ఈ మహాద్భుత పంచముఖి ప్రదర్శనలనుజూచి రౌద్ర రూపముతో హనుమంతుడు దిగంతములను ఛేదించుచు సప్తకుల పర్వతములను కంపింపఁ జేయుచు, సాగరములను ఘూర్ణింపఁ జేయుచు ప్రణవముబట్టి బ్రహ్మాదుల కభివాద మొనర్చి ప్రసిద్ధమగు చతురస్రజాతి త్రిపుట తాళమును (ఆదితాళమును) ఒకటి రెండు మూడు నాలుగు ఐదు ఆరు కాలములలోను, అనేకాక్షరముల నుసు లుగా నుంచుచు ఎడమకుడి పాదములు రెండింటితోను, వామదక్షిణ హస్తములు రెండింటితోను, వామదక్షిణ కక్షలు రెండింటితోను మొత్తమాఱంగములతోను ఆరు కాలములను, యథాక్రమముగా స్వరసాహిత్య శబ్ద కల్పనలతో వివిధ రాగభేదములతో అపూర్వమగు షట్కాలషణ్ముఖిని ప్రదర్శించెను. అంత నా పరమాద్భుత ప్రదర్శనకు పార్వతీపరమేశ్వరులును, లక్ష్మీనారాయణులును, మంగళవాద్యము ములతో హనుమంతునికడ కేఁగ యాతని రత్నమాల్యాంబరాదులచే

నలంకరించి యానందించి "రెండవబ్రహ్మవు కమ్ము" అని వరమొసంగి షట్కాలభరతాచార్యుడవు నీవే యని యిందు సందియము లేదని యనేకవిధముల గొనియాడి రంభాదులచే మంగళగీతులతో నాట్యము చేయించి యాసభ నానాటికి సమాప్తమొనర్చిరి. మఱియు నిందు మోహినీరూపధరుడగు మహావిష్ణువు ఈశ్వరుని మోహింపజేయుటకై ప్రదర్శించిన పంచముఖిలోని విశిష్టత యేమనగా - ఈశ్వరుని జయించుటకు సాహిత్యస్వరశబ్దకల్పనలతో వామపాదమున త్ర్యస్రాద్యారోహణము, దక్షిణపాదమున సంకీర్ణాద్యవరోహణంబును, దక్షిణహస్తంబున చతురస్రాద్యధిరోహణ క్రమంబును, వామహస్తంబున మిశ్రాదిప్రత్యధిరోహణ క్రమంబును, కక్షద్వయంబున ఖండాది చిత్రారోహణంబును కలిగి ప్రదర్శించుటయే విశిష్టతయైయున్నది.

## సప్తతాళ నాట్యశబ్ద విధిః

తతో బ్రహ్మ చ విష్ణుశ్చ మహేశః పవనాత్మజః
అనన్యదుర్లభాన్ చిత్రవిచిత్రాతిలయాన్వితాన్ 1

స్వస్వనామాంకితాన్ పంచముఖీ తాళ విశేషకాన్
తత్తచ్ఛబ్దానుగుణ్యేన నృత్యరీతీ రకల్పయన్ 2

అథ రంభాచ రంభోరూః కదాచి త్పరమాద్భుతం
సుధర్మామధ్యగా భూత్వా సప్తతాళేషు సంగతమ్ 3

కాంభోజీరాగ సంయుక్తం మిశ్రచాపు లయాన్వితం
తాళశబ్దం తరితఝుంతేత్యాదికం స్ఫుటభాషిణీ 4

యన్నాట్య మకరో త్తత్ర సర్వదేవముదావహం
తద్ధి లోకే సప్తతాళ నాట్యమిత్యభిధాం దధౌ 5

## సప్తతాళ నాట్యశబ్ద విధివివరణము

అంతట బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, హనుమంతుడు అనన్య దుర్లభములును, అమానుషములును, చిత్రవిచిత్ర లయాన్విత ములును నగు పంచముఖి తాళవిశేషములకు వారివారి నామము లతో నామకరణము లొనరించి యనేక శబ్ద విధులతో నృత్యభంగిమ లొనర్చిరి. పిదప నొకనాడు రంభోరువగు రంభ దేవ సభామధ్య భాగమున సప్తతాళములకు సరిపడునట్లు కాంభోజి రాగముతో మిశ్రజాతి చాపుతాళములో "తరితఝంత" మున్నగు శబ్దములతో సమస్త దేవతలు సంతసించు విధంబున నాట్యమొనర్చెను. అందుచే దానికి సప్తతాళనాట్య మను నామమబ్బెను. ఆ శబ్ద మీదిగువ వ్రాయబడుచున్నది.

### శబ్దము

తరితఝం, తత్తఝం తఝం తఝం-తరిత జగణగ-తగణ జగ కిణ-తారిధణ-తారిఝణు-తార్ధిమి-తత్తరి- రితతరి-తతరి-తరితరితరిత-ధింకుతక-ధింధింకుతంక్కుక-తరిత కిణతఃకిణ = దణతఝణు తఝణు-ధిమితగధితగ్గధి = తతరిత ఝ్ఖుకు-ధరేక -ధణేకు తకుందరిత-దాంధణత-ధీంధిమిత-తాంతరిత - ఝుంతకిటధిట - తత్తెయ్యతతోంగః - తగజగణ తధంగిణ-తఃద్దిరుగుడు తఝంతరి = సా గుణవార, యదువీర, నగధీర। సుకుమార। సముదార - స్వర్గపురవిహార। మణిహార। జగదాధార। ఝంతద్ధిత్తరిత। తకుందరి తాంత। రికుందరిఝుంత। గధి తధితోంత। ధితరితఝం తకుం -ధిత్తాహరికి దరి। తరితాఝాగధిణంత -ఝాఝా గధిణంత - ధిర్ఝాధిగణంత-దదఃధణ త - ధణంత-కిణంత-ఝణుంత - ధిమింత-గధింత-తరింత-ధణం-ఝణుం-ధిమిం-గధిం - తరిం - తరిత = ధీణుధిత్తారితకఝంఝం-తారిఝణుం ఝ్ఖుకుతకఝం-తారికిణధణ కిణ తకిణణం-ధాణుధణకిణధణతఝణుధి-తతధిత-తతధిత్త-తధితత = దత్తు శుభవీతు - కలశీతు-ఘనవతు-కమలాతు-నయదీతు - బుధరక్షా పేతు-విజి

తాతు-శుభలతుణమురారీ-త్తరి త్తరితతరిఝం-తతరిఝంతరి-ధితరితాంతరి ఝంణుధితాంతరి-తారితః-తరితః-రితదరిత - తద్దణాంతరి ధణతకిణఝం-ధణతకిణఝం - కిణతఝంణతఝం-తఝంతా + కిణతఝాగధి- ధిన్న తద్దిన్న తరికిధిన్నత-తధిన త త్తఃతరిత ధినగది-తగణజగ-జగణతగ - తగ జగణగణ-జగణగతగణ-తగజగ-తగధి తగధిక- గధితధితధిత - నీలమణి జాల-తనుశీల-సుకపోల- మణిచేల - కరుణాలోల - మృదుశీల - ఘన వాగ్జాల-రుక్మిణీలోల-గోపాలబాల - కుచేలపాల - సప్తతాళ శబ్దాం కితరే = కిడతకధరి గిత్తతఝంతరి-కిడ్తక ఝేకిడతక-ధింకిడతక - తద్ది రుగుడు-తకధిరుగుడు-ధరుగుడు-ధరుగుడు - ధరికిత్తక - ఝేకిడ్తక-ఝంతరికిడతక-కిడదా-కిడదా-కిడదా = ధంకిత్తకఝంతరికిత్తకతళాంగు తక దధిగిణతొం-ఝంతరికిడతక తళాంగుతక దధిగిణతొం-ఝంతరికిడ తక తళాంగుతక దధిగిణతొం = కిడ్తక తళాంగుతక దధిగిణతొం-కిడ తక తళాంగుతక ధరిగిణతొం - కిడతక తళాంగుతకదధిగిణతొం = తళాంగుతక దధిగిణతొం-తళాంగుతక దధిగిణతొం-తళాంగుతక దధి గిణతొం.

నందీశ్వరభరతమున సప్తతాళ నాట్యశబ్దమనే
ద్వితీయాధ్యాయము సమాప్తము

# నందీశ్వరభరతము

## తృతీయోధ్యాయః

### తత్రతఏకోత్తరశతతాళ విధివివరణం

తాళే చంచత్పుటం జ్ఞేయం గురుద్వంద్వం లఘుప్లుతం.  1

ఇందు రెండు గురువులు, ఒక లఘుపు, ఒక ప్లుతము నుండు వని యర్థము. చతురస్రజాతి 32 క్రియలుగల తాళము. విషమయతి ఈ చంచత్పుట తాళమున నుండును. ఇట్లే అంతటను గ్రహింప వలెను.

గురు ర్లఘూ గురు శ్చైవ భగౌ ఛాదపుటాభిదే.  2

ఇందు ఒక గురువు, రెండులఘువులు, ఒక గురువు, భగణము, అనగా ఒక గురువు రెండు లఘువులు గురువునందును త్రిశ్రజాతి 18 క్రియలుగలది. పిపీలక యతి. ఛాదపుటతాళము.

పలగాగలపశ్చైవ షట్పితాపుత్రక స్తథా.  3

షట్పితాపుత్రక తాళము. ఇందు ఒక ప్లుతము, రెండు గురువులు, ఒక లఘువు, ఒక ప్లుతము నుండును. విషమయతి. ఖండజాతి 60 క్రియలు గలది.

మగణశ్చ ప్లుతాద్యంతం సంపద్వేష్టిక సంజ్ఞకే.  4

సంపద్వేష్టిక తాళము:. ఇందు మగణము అనగా మూడు గురువులు. ప్లుతాద్యంతమనగా ఆ మ గ ణ మునకు ఆదిని, అంతమున ప్లుతము లుండునని యర్థము. మిశ్రజాతి—84 క్రియలు గలది.

ఉద్ఘట్ట సంజ్ఞకే తాళే భగణశ్చ ప్రకీర్తితః. 5

ఉద్ఘట్ట తాళము. ఇందు ఒక గురువు రెండు లఘువులు నుండును. సంకీర్ణ జాతి. 36 క్రియలు గలది. విషమ యతి.

ఆదితాళే చ లోకే తు లఘురేక స్స్మృతః పృథక్. 6

ఆదితాళము. ఇందొక లఘువు మాత్రమే యుండును. చతురస్ర జాతి. 4 క్రియలు గలది.

దర్పకే తు ద్రుతద్వంద్వం గురుశ్చైవ ప్రకీర్తితః. 7

దర్పకతాళము. ఇందు రెండు ద్రుతములు, ఒక గురువు నుండును. త్రిశ్రజాతి 10 క్రియలు గలది. స్రోతోవహా యతి.

అష్టకద్వన్తు చర్చర్యాం విరామాంతం ద్రుతం లఘుః. 8

చర్చరితాళము. విరామాంతమైన ద్రుతము. ఒక లఘువు నుండును. 0—81, 0—8—1. 0-8—1. 0—8-1, 0—8—1, 0—8—1, చతురస్రజాతి 72 క్రియలు గలది.

సింహాలీలే విధాతవ్యం లఘ్వాద్యంతం ద్రుతత్రయం. 9

సింహాలీలా తాళము. ఇందు ఆద్యంతముల లఘువులుండి మూడు ద్రుతము లుండును, సంకీర్ణ జాతి. 24 క్రియలు గలది.

ద్రుతద్వంద్వం యకారశ్చ కందర్పః పరికీర్తితః. 10

ఇయ్యది కందర్పతాళము ఇందు రెండు ద్రుతములు; ఒక యగణము నుండును. మిశ్రమజాతి. 39 క్రియలు గలది. స్రోతోవహాయతి.

సింహావిక్రమతాళే స్యు ర్మగణో లపలాగపౌ. 11

సింహావిక్రమ తాళము. ఇందు మగణము లఘువు, ప్లుతము, లఘువు, గురువు, రెండు ప్లుతములు నుండును. చతురస్రజాతి. 76 క్రియలు గలది. విషమ యతి.

శ్రీరంగ సంజ్ఞకే తాళే సగణో లప్లుతౌ మతః. 12

శ్రీరంగ తాళము. ఇందు ఒక సగణము, లఘువు, ప్లుతము నుండును. ఖండజాతి 40 క్రియలు గలది.

రతిలీలే విధాతవ్యం లఘుద్వంద్వం గురుద్వయం. 13

రతిలీల తాళము. ఇందు రెండు లఘువులు. రెండు గురువులు నుండును. త్రిశ్రజాతి. 15 క్రియలు గలది.

చతుర్దశే రంగతాళే ప్లుతౌ చ గురుతః పరమ్ 14

పదునాల్గవదైన రంగతాళము. ఇందు రెండు ప్లుతములు. గురువు నుండును ఖండజాతి. 40 క్రియలు గలది.

పరిక్రమే లఘుద్వంద్వం యగణ స్తదనంతరమ్. 15

పరిక్రమ తాళము. ఇందు రెండు లఘువులు, ఒక యగణము నుండును. మిశ్రజాతి. 49 క్రియలు గలది.

ప్రత్యంగతాళే కర్తవ్యం మగణశ్చ లఘుద్వయమ్ 16

ప్రత్యంగ తాళము. ఇందు మగణము రెండు లఘువులు నుండును. చతురస్రజాతి. 48 క్రియలు గలది.

లచతుష్కం విరామాంతం గజలీలే ప్రకీర్తితమ్. 17

గజలీల తాళము. ఇందు నాలుగు లఘువులు విరామము నుండవలెను. త్రిశ్రజాతి. 13 క్రియలు గలది.

లఘు ర్గురుః ప్లుతశ్చైవ త్రిభిన్నే పరికీర్తితః. 18

త్రిభిన్న తాళము. ఇందు ఒకలఘువు, ఒకగురువు, ఒక ప్లుతము నుండును. ఖండజాతి. 30 క్రియలు గలది.

వీరవిక్రమతాళేతు లద్రుతౌచ గురు స్తథా. 19

వీరవిక్రమ తాళము. ఒక లఘువు రెండు ద్రుతములు ఒక గురువు నుండును. సంకీర్ణ జాతి. 31 క్రియలు గలది.

సవిరామం లఘుద్వంద్వం తాళే స్యాత్తు సలీలకే. 20

ఒక గురువు రెండు లఘువులు సలీలక తాళమందుండును. చతురస్ర జాతి. 9 క్రియలు గలది.

వర్ణాభిన్నాభితాళేతు ద్రుతద్వంద్వం లఘు ర్గురుః. 21

వర్ణాభిన్నాభితాళము. ఇందు రెండుద్రుతములు, ఒకలఘువు, ఒక గురువు నుండును. త్రిశ్రజాతి. 13 క్రియలు గలది.

రాజచూడామణౌ తాళే ద్రుతౌ నశ్చ ద్రుతౌ లఘూ. 22

రాజచూడామణి తాళము. ఇందు రెండు ద్రుతములు ఒక నగణము, రెండు ద్రుతములు రెండు లఘువులు నుండును. మిశ్ర జాతి. 43 క్రియలు గలది.

రంగద్యోతన తాళేతు ఘగణో లప్లుతో మతః. 23

రంగద్యోతన తాళము. ఇందు ఒకమగణము, ఒక లఘువు, ఒక ప్లుతము నుండును. ఖండజాతి. 50 క్రియలు గలది.

గపౌ ద్రుతౌ గలౌ పశ్చ రాజతాళే ప్రకీర్తితః. 24

రాజతాళము. ఇందు ఒక గురువు, రెండు ప్లుతములు, రెండు ద్రుతములు, ఒక గురువు, రెండు లఘువులు, ఒకప్లుతము నుండును. చతురస్రజాతి. 64 క్రియలు గలది.

ద్వౌ లౌ పశ్చ గలౌ పశ్చ సింహావిక్రీడితే లపౌ. 25

సింహావిక్రీడిత తాళము. ఇందు రెండు లఘువులు, ఒక ప్లుతము, ఒక గురువు, రెండు లఘువులు, ఒక ప్లుతము, ఒక లఘువు, రెండు ప్లుతములు నుండును. త్రిశ్రజాతి. 57 క్రియలు గలది.

వేదద్రుతౌపౌ ద్రుతౌచ వనమాలినిగస్తథా. 26

వనమాలిని తాళము. నాలుగు ద్రుతములు, రెండు లఘువులు రెండు ద్రుతములు, ఒక గురువు నిందుండును. మిశ్రజాతి. 40 క్రియలు గలది.

గురు ర్లఘూ ద్రుతౌ గశ్చ వర్ణేశే చతురస్రకే. 27

చతురస్రక తాళము. ఇందు ఒక గురువు, రెండు లఘువులు, రెండు ద్రుతములు, ఒక గురువు నుండును. చతురస్రజాతి. 28 క్రియలు గలది.

లఘు ద్రుతౌ లగశ్చేతి త్రిశ్రవర్ణే ప్రకీర్తితః. 28

త్రిశ్రవర్ణ తాళము. ఇందు లఘువు, రెండు ద్రుతములు, ఒక లఘువు, ఒక గురువు నుండును. త్రిశ్రజాతి. 16 క్రియలు గలది.

రంగప్రదీప తాళేతు తగణశ్చ ప్లుతం భవేత్. 29

౨౦. ప్రదీపతాళము. ఇందు తగణము, ఒక ప్లుతము నుండును. త్రిశ్రజాతి. 24 క్రియలు గలది.

ప్రతితూర్యే విరామాంతం మిశ్రాఖ్యే ద్వాదశ ద్రుతాః. 30

ప్రతితూర్య తాళము. మిశ్రమమగుచు విరామాంతముగా పండ్రెండు ద్రుతము లుండును. 27 క్రియలు గలది. ఈ తాళము నకు గురులఘువులు లేనందున జాతిలేదు.

లప్లుతంచ ద్రుతౌ దీర్ఘో హంసనాదో నిరూపితః. 31

హంసనాద తాళము. ఇందు లఘువు, ప్లుతము, రెండు ద్రుతములు, దీర్ఘము - అనగా గురువు నుండును. చతురస్రజాతి. 28 క్రియలు గలది.

జగణో లగురుశ్చైవ సింహనాదః ప్రకీర్తితః. 32

సింహనాదతాళము. ఇందు జగణము, లఘువు, గురువు నుండును. సంకీర్ణ జాతి. 63 క్రియలు గలది.

తాళస్స్యాద్వల్లికశ్చాదౌ లద్వయం ద్రుచతుష్టయం. 33

వల్లికతాళము. ఇందు రెండు లఘువులు, నాలుగు ద్రుతములు నుండును. మిశ్రజాతి. 22 క్రియలుగలది.

లఘుర్ద్రుతచతుష్కంచ లద్వయం శరభలీలకే. 34

శరభలీలక తాళము. ఇందు లఘువు 4 ద్రుతములు, రెండు లఘువు లుండున. త్రిశ్రజాతి. 17 క్రియలు గలది.

తగణో లః ప్లుతం కార్యం రంగాభరణ సంజ్ఞకే. 35

రంగాభరణ తాళము. ఇందు తగణము. లఘువు, ప్లుతము నుండును. చతురస్రజాతి. 86 క్రియలు గలది.

తురంగలీల తాళే స్యాత్ ద్రుతద్వంద్వం లఘుస్తథా. 36

తురంగలీల తాళము. ఇందు రెండు ద్రుతములు, ఒక లఘువు నుండును. త్రిశ్రజాతి. 7 క్రియలు గలది.

తపోలోగాద్రుతౌ గౌల పలపాగశ్చలద్వయం
నిశ్శబ్దలచతుష్కంచ తాళే స్యాత్ సింహానందినీ. 37

సింహానందిని తాళము. ఇందు తగణము, ప్లుతము, లఘువు, గురువు, రెండు ద్రుతములు, రెండు గురువులు, లఘువు, ప్లుతము, లఘువు, ప్లుతము గురువు, రెండు లఘువులు నుండును. త్రిశ్రజాతి. 85 క్రియలు గలది.

రగణో లగురుశ్చైవ జయశ్రీతాళ సంజ్ఞకే. 38

జయశ్రీ తాళము. ఇందు రగణము, లఘువు, గురువు నుండును. ఖండజాతి. 40 క్రియలు గలది.

భవేయు ర్విజయానందే లద్వయం గురవస్త్రయం. 39

విజయానంద తాళము. ఇందు 2 లఘువులు, 3 గురువులు నుండును. చతురస్ర జాతి. 32 క్రియలు గలది.

లద్రుతౌ ప్రతితాళేచ తాళజ్ఞాన వినోదినః. 40

ప్రతితాళము. ఇందు లఘువు, రెండు ద్రుతములు నుండును. మిశ్రజాతి. 11 క్రియలు గలది.

మకరందే ద్రుతద్వంద్వం లఘుత్రయ మతో గురుః. 41

మకరంద తాళము. ఇందు 2 ద్రుతములు, 3 లఘువులు, గురువు నుండును. త్రిశ్రజాతి. 19 క్రియలు గలది.

లఘు ర్ద్రుతౌ గతౌ పశ్చ కీర్తితాళః ప్రకీర్తితః. 42

కీర్తి తాళము. ఇందు లఘువు, 2 ద్రుతములు, గురువు, 2 లఘువులు, ప్లుతము నుండును. చతురస్రజాతి. 36 క్రియలుగలది.

ప్లుతో గశ్చ ప్లుతో గశ్చ తాళే విజయసంజ్ఞకే. 43

విజయతాళము. ఇందు ప్లుతము, 1 గురువు, ప్లుతము, గురువు నుండును. ఖండజాతి. 50 క్రియులు కలది.

సగణ ద్వితయం తచ్చ తాళే తు జయమంగళే. 44

జయమంగళ తాళము. 2 సగణము లుండును. ఖండజాతి. 50 క్రియలు గలది.

లఘు ర్వక్రో ద్రుతౌ తాళే రాజవిద్యాధరాభిదే. 45

రాజవిద్యాధర తాళము. ఇందొక లఘువు, గురువు, 2 ద్రుతములు నుండును. చతురస్ర జాతి. 16 క్రియలు గలది.

సగణో మధ్యతాళే తు కల్పితం ల చతుష్టయం. 46

మధ్యతాళము. ఇందు సగణము, 4 లఘువు లుండును. త్రిశ్ర జాతి. 24 క్రియలు గలది.

జగణో లో ద్రుతౌ పశ్చ జయతాళే ప్రకీర్తితః. 48

జయతాళము. ఇందు జగణము, లఘువు, 2 ద్రుతములు, ప్లుతము నుండును. మిశ్రజాతి. 60 క్రియలు గలది.

ద్రుత ద్వంద్వం లఘుద్వంద్వం భవే త్తాళే కురుత్తకే. 49

కురుత్తక తాళము. ఇందు 2 ద్రుతములు, 2 లఘువులు నుండును. త్రిశ్రజాతి. 10 క్రియలు గలది.

లఘుద్వంద్వం విరామాంతం తాళే నిస్సారుకా విధా. 50

నిస్సారుడి తాళము. ఇందు 2 లఘువులు, విరామము నుండును. సంకీర్ణజాతి. 19 క్రియలు గలది.

ద్రుత ద్వంద్వం విరామాంతం క్రీడతాళః ప్రకీర్తితః. 51

క్రీడ తాళము. ఇందు 2 ద్రుతములు, విరామము నుండును. ఈ తాళమునకు గురులఘువులులేవు గాన జాతిలేదు. 5 క్రియలు గలది.

త్రిభంగాఖ్యస్య తాళస్య జగణశ్చ గురు తథా. 52

త్రిభంగ తాళము. ఇందు జగణము, ఒక గురువు నుండును. ఖండజాతి. 30 క్రియలు గలది.

కోకిలక్రియ తాళస్య గురుర్లశ్చ ప్లుతం స్తథా. 53

కోకిలక్రియ తాళము. ఇందు ఒక గురువు, లఘువు, ప్లుతము నుండును. సంకీర్ణజాతి. 54 క్రియలు గలది.

శ్రీకీర్తి సంజ్ఞకే తాళే గురుద్వంద్వం లఘుద్వయం. 54

శ్రీకీర్తితాళము. ఇందు రెండు గురువులు, రెండు లఘువు లుండును. చతురస్రజాతి. 24 క్రియలు గలది.

ముద్రికే తాళసంజ్ఞేతు నిశ్శబ్దశ్చ గురుర్లఘూ. 55

ముద్రికా తాళము. ఇందు 1 గురువు, 2 లఘువులు కాక పదము నుండును. త్రిశ్రజాతి. 12 క్రియలు గలది.

చత్వారో బిందవో గురూ చాద్యంతౌ బిందు మాలిని. 56

బిందుమాలిని తాళము. అందు గురువు, 4 బిందువులు, గురువు నుండును. చతురస్రజాతి. 24 క్రియలు గలది.

సమతాళే లఘుద్వంద్వం విరామాంతం ద్రుత ద్వయం. 57

సమతాళము. 2 లఘువులు. 2 ద్రుతములు విరామము అంతముననను, నుండును. ఖండజాతి. 15 క్రియలు గలది.

లఘూ ద్రుతౌ ప్లుతశ్చైవ తాళే స్యాన్నందనాభిదే. 58

నందన తాళము. ఇందు 2 లఘువులు, 2 ద్రుతములు, 1 ప్లుతము నుండును. మిశ్రజాతి. 39 క్రియలు గలది.

మఠికోయం విధాతవ్యః గురుర్బిందుః ప్లుతక్రమాత్. 59

మఠిక తాళము. ఇందు గురువు. బిందువు, ప్లుతము నుండును. మిశ్రజాతి. 37 క్రియలు గలది.

లఘుః ప్లుతస్సకారశ్చ తాళే చాభంగలీలకే. 60

అభంగలీలక తాళము. ఇందు లఘువు, ప్లుతము, సగణము నుండును. త్రిశ్రజాతి. 24 క్రియలు గలది.

దురీక్షణే లఘుద్వంద్వం గురు రేకః ప్రకీర్తితః॥ 61

దురీక్షణ తాళము. ఇందు 2 లఘువులు, 1 గురువు నుండును. చతురస్ర జాతి. 16 క్రియలు గలది.

వేదద్రుత విరామాంతం ద్వివారం విషమే మతః 62

విషమ తాళము. ఇందు 4 ద్రుతములు, విరామము, మరల 4 ద్రుతములు, విరామము నుండును. జాతి లేదు. క్రియలుగలది.

ధంకితా రగణేనస్యా దేషా చిచ్చైవ యోజనా. 63

ధంకితా తాళము. ఇందు రగణ మొక్కటియే యుండును. చతురస్ర జాతి. 20 క్రియలు గలది.

నందితాళే సముద్దిష్టో లఘు ర్బిందు ర్లఘు ర్గురుః, 64

నంది తాళము. ఇందు ఒక లఘువు, బిందువు. లఘువు గురువు నుండును. ఖండజాతి. 22 క్రియలు గలది.

ఏకేనైవ ద్రుతేన స్యాదేకతాళాభిసంజ్ఞకః. 65

ఏకతాళము. ఒక్క ద్రుతముండును. జాతిలేదు. 2 క్రియలు గలది.

లఘుద్వంద్వం గురుద్వంద్వం కందుకః పరికీర్తితః. 66

కందుక తాళము. ఇందు 2 లఘువులు, 2 గురువులు నుండును చతురస్ర జాతి. 24 క్రియలు గలది.

ఏకో లఘు ర్గురుద్వంద్వం కంకాళవిషమే భవేత్. 67

కంకాళవిషమ తాళము. ఇందు ఒక లఘువు, 2 గురువులు నుండును. మిశ్రజాతి. 35 క్రియలు గలది.

లద్వయం బిందుయుగ్మంచ గురుశ్చైవాభినందిని. 68

అభినంది తాళము. 2 లఘువులు, 2 బిందువులు, గురువు నుండును. ఖండ జాతి. 24 క్రియలు గలది.

నగణశ్చ లఘుశ్చైవ విరామాంతం ద్రుతద్వయం
మల్లతాళేతు భరత ఉవాచైవం విధేన హ. 69

మల్లతాళము. ఇందు నగణము, లఘువు, 2 ద్రుతములు విరామము నుండును. చతురస్రజాతి. 21 క్రియలు గలది.

చతుస్తాళే గురుః పూర్వం తతో బిందు త్రయం భవేత్. 70

చతుస్తాళము. ఇందొక గురువు, 3 సున్నలు నుండును. సంకీర్ణ జాతి. 24 క్రియలు గలది.

అభంగతాళే కర్తవ్యం లఘో రంతే త్రిమాత్రకమ్. 71

అభంగ తాళము. ఒక లఘువు, త్రిమాత్రక మనగా ప్లుతము. త్రిశ్రజాతి. 12 క్రియలు గలది.

విరామాంతం లఘుద్వంద్వం తాంబికే పరికీర్తితమ్. 72

తాంబిక తాళము. 2 లఘువులు, విరామము నుండును. మిశ్ర జాతి. 15 క్రియలు గలది.

రగణా ద్బిందుయుగ్మంచ రాజంబేకోళ ఉచ్యతే. 73

రాజంబేకోళ తాళము. ఇందు రగణము, 2 బిందువులు నుండును. ఖండజాతి. 29 క్రియలు గలది.

ద్రుతద్వంద్వం లఘుద్వంద్వం గురుద్వంద్వం చ దీపికే. 74

ధీపిక తాళము. 2 ద్రుతములు, 2 లఘువులు, 2 గురువులు నుండును. చతురస్రజాతి. 28 క్రియలు గలది.

ఏకేన సవిరామేవ లఘుర్వా లఘుశేఖరః. 75

లఘుశేఖర తాళము. విరామము లఘువు నుండును. చతురస్రజాతి. 5 క్రియలు గలది.

ప్రతాపశేఖరే త్వంగరామాంతం ద్రుతత్రయమ్. 76

ప్రతాపశేఖర తాళము. 3 ద్రుతములు, విరామము నుండును. జాతిలేదు. 7 క్రియలు గలది.

గజఝంపే చ యమళో విరామాంతం ద్రుతద్వయం. 77

గజఝంప తాళము. యమళము, 2 ద్రుతములు, విరామము నుండును. ఖండజాతి, 15 క్రియలు గలది.

చతుర్ముఖాఖ్యే తాళే తు జగణానంతరం ప్లుతమ్. 78

చతుర్ముఖ తాళము. జగణము, ప్లుతము నుండును. 35 క్రియలు గలది.

వ్యోమద్వయం విరామాంతం లశ్చ ఝంపాభిధీయతే. 79

ఝంపా తాళము. 2 సున్నలు (అనగా 2 ద్రుతములు), లఘువు విరామము నుండును. త్రిశ్రజాతి. 8 క్రియలు గలది.

సగణో భగణో వాపి ప్రతిమధ్యే బుధైః స్మృతః. 80

ప్రతిమధ్య తాళము. సగణము, భగణము నుండును. చతురస్ర జాతి. 32 క్రియలు గలది.

తృతీయతాళో విజ్ఞేయః విరామాంతం ద్రుతత్రయమ్. 81

తృతీయ తాళము. 3 ద్రుతములు, విరామము నుండును. జాతి లేదు. 7 క్రియలు గలది.

వసంతతాళే కర్తవ్యః నగణో మగణ స్తథా. 82

వసంత తాళము. సగణము, మగణము నుండును. త్రిశ్రజాతి. 27 క్రియలు గలది.

తాళే లలిత సంజ్ఞే తు ద్రుతద్వంద్వం గురు ర్లఘుః. 83

లలిత తాళము. 2 ద్రుతములు, గురువు, లఘువు నుండును. త్రిశ్రజాతి. 13 క్రియలు గలది.

రతితాళే లఘుః కార్య స్తత శ్చైవ గురు స్తథా. 84

రతి తాళము. లఘువు, గురువు నుండును. చతురస్రజాతి 12 క్రియలు గలది.

తాళే కరుణమత్యాఖ్యే జ్ఞేయం బిందుచతుష్టయమ్. 85

కరుణమతితాళము. 4 ద్రుతము లుండును. జాతిలేదు. 8 క్రియలు గలది.

షట్తాళ సంజ్ఞకే తాళే బిందు షట్కం నిరంతరమ్ 86

షట్తాళతాళము. 6 బిందువు లుండును. జాతిలేదు. 6 క్రియలు గలది.

వర్ధనే బిందుయుగళం నిరాంతంకో లఘుః ప్లుతః. 87

వర్ధనతాళము. 2 బిందువులు, లఘువు, ప్లుతము నుండును. సంకీర్ణజాతి. 40 క్రియలు గలది.

వర్ణాయత్యభిదే తాళే లఘుద్వంద్వం ప్లుతద్వయమ్. 88

వర్ణాయతి తాళము. 2 లఘువులు, 2 ప్లుతము లుండును. మిశ్రజాతి. 66 క్రియలు గలది.

రాజనారాయణే బిందుయుగళం జగణో గురుః. 89

రాజనారాయణ తాళము 2 బిందువులు, జగణము, గురువు నుండును. ఖండజాతి. 34 క్రియలు గలది.

ద్రుతద్వంద్వం ప్లుతశ్చైవ కోమర్లే పరికీర్తితః. 90

కోమర్ల తాళము. ఇందు రెండు ద్రుతములున్నూ ఒక ప్లుతమున్నూ గలిగియుండును. చతురశ్ర జాతి. ఇయ్యది 16 క్రియలు గలిగి యుండును.

లఘు ర్ద్రుతౌ లఘుర్వక్రో ముకుందే తాళసంజ్ఞకే. 91

ముకుంద తాళము. ఇందు ఒక లఘువు, రెండు ద్రుతములు, ఒకలఘువు, ఒకగురువునుండును. మిశ్రజాతి. 32 క్రియలుగలది.

గరుడతాళే ద్రుతశ్చైవ విరామాంతం ద్రుతత్రయమ్. 92

గరుడతాళము. ఇందు ద్రుతము, మరల మూడు ద్రుతములు, విరామము నుండును. జాతి లేదు. 9 క్రియలు గలది.

శ్రీనందనస్య తాళస్య భగణః ప్లుతయోజితః. 93

శ్రీనందతాళము. ఇందు భగణము ఒక ప్లుతము నుండును. ఖండజాతి. 35 క్రియలు గలది.

బిందుర్లఘుః ప్లుత శ్చైవ లీలాతాళే ప్రకీర్తితః. 94

లీలా తాళము. బిందువు, లఘువు, ప్లుతము నుండును. ఖండజాతి. 22 క్రియలు గలది.

విలోకితే లఘు ర్వక్రం శూన్యయుగ్మం ప్లుత స్తథా. 95

విలోకిత తాళము. ఇందు లఘువు, గురువు, రెండు ద్రుతములు, ఒక ప్లుతము నుండును. చతురస్రజాతి. 28 క్రియలు గలది.

లలితప్రియ తాళస్య సగణానంతరం లఘుః. 96

లలితప్రియ తాళము. సగణము, ఒక లఘువు నుండును. సంకీర్ణజాతి. 45 క్రియలు గలది-

జనకాభిధతాళస్య నయతాశ్చ తతో గురుః. 97

జనక తాళము. ఇందు న గణ య గణ త గణములు నొక గురువు నుండును. చతురస్రజాతి. 60 క్రియలు గలది.

లక్ష్మీతాళేతు యుజ్యంతే ద్రుతద్వంద్వం లఘుప్లుతమ్. 98

లక్ష్మీతాళము. ఇందు రెండు ద్రుతములు, లఘువు, ప్లుతము నుండును. చతురస్ర జాతి. 20 క్రియలు గలది.

లఘుద్వయం విరామాంతం ప్లుతంస్యా ద్రాగవర్ధనే. 99

రాగవర్ధన తాళము. 2 లఘువులు, ప్లుతము, విరామము నుండును. మిశ్రజాతి. 36 క్రియలు గలది.

పార్వతీలోచనే తాళే లౌ ద్రుతౌ తనభాః క్రమాత్. 100

పార్వతీ లోచన తాళము. 2 లఘువులు, 2 ద్రుతములు, తగణ నగణ భగణములు క్రమముగా నుండును. చతురస్ర జాతి. 60 క్రియలు గలది.

గగగా లలప శ్చైవ గలలా పసమన్వితం
సర్వ విఘ్నోప శాంత్యర్థం తాళే సిద్ధివినాయకే. 101

వినాయకతాళము. ఇందు మూడు గురువులు రెండు లఘువులు, ప్లుతము, గురువు, రెండు లఘువులు, ప్లుతము నుండును. త్రిశ్రజాతి. 54 క్రియలు గలది.

నందీశ్వర భరతమున ఏకోత్తరశతతాళ నిరూపణమను
మూడవ యధ్యాయము సమాప్తము.